# శతక సంపుటి

(ద్వితీయం భాగవం)



This book is published with the
Financial Assistance of
Sri Tirumala Tirupati Devasthanam
under the scheme
Aid to Publish Religious books

ఈ "శతక సంపుటి" (ద్వితీయ భాగము)
శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానము వారి ద్రవ్యసహాయమున
ముద్రితము.
వారికి నా హృదయపూర్వక కృతజ్ఞతలు.

ప్రథమ ప్రచురణ - అక్టోబరు 1992
ప్రతులు :- 1000





వెల : 20-00

ప్రాప్తిస్థానము :
మధురకవిరత్న - కావ్యార్క - కవిశేఖర
**మండా పేరన్నశాస్త్రి**
డోర్. నెం. 25-11-16
అయ్యకోనేరు తూర్పు[illegible]
విజయనగరం-2
Pin-531 202.



ముద్రణ :
శ్రీ కృష్ణా పవర్ ప్రెస్
విజయనగరం-531 202
ఫోన్ : 4740

# అభినందనము

---

బ్రహ్మభూషణ, సాహిత్యోభయభాషాప్రవీణ

**బ్రహ్మశ్రీ రాంభట్ల లక్ష్మీనారాయణశాస్త్రిగారు, M.A.**

ఉ॥ వ్రాసినవాఁడు పేరకవి వాడినభాస రసోత్తరంబు ను
ల్లాసముఁ గూర్చుభావములు లాలితసౌరచనావిశేషమున్
భాసిల దివ్యసౌకృతిని వర్ణనసేయఁగనేల? యొక్కఁడా
భాసురకాంతిలోవెలుఁగు భాస్కరుఁగూర్చి వచింపశక్యమే!

కం॥ పదములు మృదువులు తత్త్వా
స్పదములు భావములు హృదయసంవాదంబుల్
మృదుళములై విమలశ్రీ
సదనములై యొప్పునిందు సర్వవచనముల్!

ఉ॥ భాషలరెండిటన్ తనదుపాండితిఁ జూపె నితండు లెస్ససం
భాషణచేయునట్లు మృదుభావమణుల్ విలసిల్లదీనిసం
భూషితమున్ పొనర్చెనిఁకఁ బూర్వకవీశుల మించె ధారలో
శేషుని బోలినాఁడన విశేషముతోపడు నామనస్సునన్!

శా॥ రమ్యాలంకృతులన్ మృదూక్తులను రారాజద్విలాసంబులన్
సౌమ్యాకారమునన్ ప్రసన్నగుణసంసర్గంబునన్ భావనా
గమ్యంబై తనరారుభావముల హృద్గాంభీర్యసంశ్లేషలన్
కామ్యంబై యలరారె నీకృతికలాకన్యాత్మ ధన్యాత్మయే!

ఉ॥ పూర్వకవీంద్రసూక్తులను బొందికగా సమకూర్చి యిందునా
శర్వరిగాథలందుఁగల సారముఁ జక్కఁగనింపి భావనల్
బర్వులువెట్టి సత్కవి సెభాసని మెచ్చ రచించితయ్య! యీ
సర్వజనాదరంబుఁగని శాశ్వతమై యలరారుకావ్యమున్.



# విషయసూచిక



# శ్రీ సత్యనారాయణ శతకము



శ్రీలంగూర్చు కటాక్షమాలికలఁ గూర్మిన్ గూర్చి విజ్ఞాన వి
ద్యాలాభంబులు, వాంఛితార్థఫలసిద్ధ్యర్థంబు లందించి శ్రీ
యోలబ్ధిం గలిగించి భక్తజన సంఘోత్సాహముం బెక్కుభం
గాలం గూర్చెదు మేటివేల్పువుగదన్నా ! సత్యనారాయణా !

శా॥ ప్రారంభించితి నీపయిన్ శతకమున్ భక్తిన్ రచింపంగ శో
భారూఢంబుగ సుప్రసాదగుణపాకాలంకృతుల్ లలి. సు
శ్రీరమ్యంబుగఁ గూర్పఁగాఁ గల మహాశీర్వాదముంజేసియా
కారస్ఫూర్తి నొసంగ వేడెద గుణౌఘా! ! సత్యనారాయణా !

మ॥ ధరణిన్ దావకభక్తశేఖరులు శ్రద్ధాభక్తులన్ గుళ్ళ గో
పురముల్ కట్టుచు నీకొసంగెదరు సమ్మోదంబుతో; నేను మో
దరసస్ఫూర్తిని పద్యపుష్పములు ఛందస్సూత్రమున్ మాల గ
ట్టి రహిన్ వైచెద నీదుకంఠమున తండ్రీ! సత్యనారాయణా!

మ॥ అల ప్రహ్లాద పరాశ రాంబరిష భీష్మాగస్త్య వాల్మీకి, ది
వ్యలసన్నారద పుండరీక శుక సంభత్రాత్రిభవుల్ ముఖ్యభ
క్తులు నీపాదపయోజముల్ వితతభక్త్యుద్రేకసంపత్తి ని
శ్చలతన్ గొల్చిరె! పొందరే! శుభము లీశా! సత్యనారాయణా!

మ॥ హరిగోవిందముకుందమాధవయుపేంద్రా శ్రీధరా! కృష్ణ శౌ
రి రమానాధ పయోజనాభ, యసురారీ ! విష్ణు దామోదరా
మురసంహారక చక్రి! యంచు నిరతంబున్ భక్తి నిన్గొల్చు నా
నరుఁడే ధన్యుఁడు పుణ్యుఁ డీజగతిలోనన్ సత్యనారాయణా!

మ॥ నినుఁజింతుచుచు నున్నవాఁడు మది నిన్నే నమ్మిపూజించువాఁ
డును నిత్యమ్మును నీకథల్ వినెడివాఁడున్ నీవ్రతం బాస్థతో
డను సద్భక్తి నొనర్చువాఁడు దమితోడన్ సర్వవాంఛాప్రదం
బును బొందుఁగా పద మిందు నందుగద శంభూ ! సత్య !

మ॥ తొలి భూదేవునిమీఁద కాష్ఠవహునందున్ బైన యావైశ్యపై
నలభూపాలుని మీద గోపకులపై నాద్యంతమున్ బారు ని
ర్మలకారుణ్య సుధాప్రసార మనుకంపన్ నావయిం గూడ ని
చ్చలు నింపన్ దమి వేడుకొందుఁబరమేశా! సత్యనారాయణా!

శా॥ "దారిద్ర్యమ్మునగాని, రోగములచేతన్గాని పెన్దుఃఖసం
భారశ్రేణులచేతగాని మఱి యే బాధాదులం జిక్కి నె
వ్వారైనన్ దమి నా వ్రతంబు నొనరింపఁగా వారి కష్టంబు లీ
డేరున్ సౌఖ్యము శాంతిఁగల్గు"ననవే శ్రీసత్యనారాయణా !

మ॥ బ్రదుకం గల్గిన యన్నినాళులు మనోవాక్కాయకర్మంబులన్
నిదురన్ జాగ్రదవస్థలో సహితమున్ నీనామసంకీర్తనా! భ్యుద
యమ్ముల్ వడినిమ్ము దాన కలుషంబుల్ వెస్కకుందోసి నీ
పదసాన్నిధ్యముఁజేరెదన్ సుగుణకల్పా ! సత్యనారాయణా !

మ॥ పరితాపంబుల పోక, సర్వశుభసంపద్వృద్ధికిన్ రాక, సత్వరపు
ణ్యంబుల ఢాక, కోర్కె నెఱవేర్పం గేక, పాపాత్మసత్
పరిశుద్ధిన్ మినువాక, సంసృతిఝరిన్ దాటించు మేల్నాక సు
స్థిరసౌఖ్యమ్ముల దాక మీవ్రత మహో శ్రీసత్యనారాయణా!

మ॥ కనగాధారుణిపై 'నవశ్యమనుభోక్తవ్యంకృతంకర్మ' మంచని
యార్యుల్ వచియింతురిగాని, మనుజుం డత్యంతభక్త్యున్నతిన్
నిసుఁ జింతించుచు నీవ్రతమ్ము సలుపన్ నిక్కంబుగా వాని కం
టిని దెప్పంబలెఁబ్రోతు వెల్లపుడు తండ్రీ! సత్యనారాయణా!

మ॥ ప్రతిపద్యంబు రసోచితంబుగ రచింపంగల్గు వాక్ఛక్తి, హృ
ద్గతభావంబు పరిస్ఫుటంబుగను వక్కాణించు ధీశక్తి, వి
జ్ఞత గూర్పంగల ధర్మవర్తనముపై గాఢంపు సద్భక్తి, సం
తత నీపాదపయోజభక్తి నిడుమన్నా ! సత్యనారాయణా !

మ॥ అనపత్యుల్ కనివారు సంతతిని రోగార్తాళి నీరోగులై
పునరుజ్జీవన మందినారు, చెఱలం బొల్వారు బందీలు ము
క్తిని గన్నారు భవద్వ్రతంబు ననురక్తిన్ సల్పి? సద్భక్తసం
జనితానందపదుండ వీవు జగదీశా ! సత్యనారాయణా !

మ॥ సమతాభావము, సత్యశీలము, సమస్తప్రాణులం దెప్డు స
క్రమవాల్లభ్యము ధర్మవర్తనము సత్కారుణ్యభావంబు వి
క్రమమున్ భక్తియు సామరస్యమును సంఘంబంధుమేల్శక్తి ని
త్యము మాభారతజాతికిమ్ము జనమాన్యా! సత్యనారాయణా!

మ॥ పదునై దేడుల ప్రాయమందున కవిత్వం బల్లగా నేర్చి నీ
పదపంకేరుహమే శరణ్యమని సంభావించి యెన్నే కృతుల్
ముదమారన్ విరచించి నీకిడితి సమ్మోదంబుతోఁ బ్రేమసం
పదలన్ జిల్కుచు నన్నుఁగావు శ్రితకల్పా! సత్యనారాయణా!

శా॥ దారిద్ర్యమ్ముఁబోకార్చిచిత్తమునకున్ స్థైర్యంబుఁజేకూర్చి ని
స్సారంబైన మదీయ జీవలత కుత్సాహంపు వర్షమ్ము నిం
పారన్ నిండుగ గూర్చి పేర్చె సను సత్యంతంబుఁగాపాడుమీ
కారుణ్యామృతపూరనూరితశుభాంగా ! సత్యనారాయణా !

శా॥ కన్నుల్ నిన్గనున్నట్లు చేతులు భవత్కైంకర్యమున్ జేయున
ట్లున్నావీనులు నీకథల్ వినెడు నట్టుల్ నాదు చిత్తమ్ము భ
క్తిన్నిన్నే భజియించునట్టుల ప్రసాదింపంగదే సద్వరం
బన్నా ! మంగళరంగసజ్జనితదేహా ! సత్యనారాయణా !

మ॥ నగనీ లోకులు ప్రాతభక్తియననీ నాస్తిక్యమం చాడనీ
వెగటే చెందగనీ పిసాళియననీ వేజాడలం దిట్టనీ
వగపే బొందగనీ వినమ్రిత భవత్పాదాబ్జసేవామృతా
పగలో మున్గినవాఁడు లెక్కఁగొనఁడప్పా! సత్యనారాయణా !

మ॥ విదితప్రౌఢి రహింప సేకపతనావృత్తిక్రియన్ విద్యాలం
బదునాల్గింటిని నేర్చు విజ్ఞుఁడును నానందంబుఁగానంగఁ జోఁ
టెదియో యార్తిఁగలంప దుఃఖపడు నెంతే సజ్జుఁడాగాక నీ
పదసంసక్తుఁడు గాంచఁ డార్తి సుజనాప్తా! సత్యనారాయణా !

మ॥ పరమాకాశపథంబుకున్ జని జరింపన్ వచ్చు నాపైని ది
ద్దిర యావద్ధరణీతలంబు సుఖసక్తిన్ జుట్టిరావచ్చు, దు
ర్భరసంసారపయోధి దాటఁగ దరంబా? యీదృశక్షుద్రవై
ఖరులన్? త్వత్కరుణామహాతరణిఁదక్కన్ సత్యనారాయణా!

మ॥ ధరణీమండలఖండతండముల కాదర్శోన్నతిం గన్న మా।భర
తోర్విన్ నిగమోక్త మార్గము కృశింపన్ జొచ్చె మ్లేచ్ఛాంగ్లము
ష్కరసాంగత్యము హెచ్చె నీతి మొదలె స్తంభించె, స్వార్థాశ దు
ర్భరమౌ మోసము హెచ్చె పూనవొ మరల్పన్ సత్య!

మ॥ రవి యద్దంబగు, నగ్ని నీరమగు సర్పస్వామి పూదండగా
నవు, సింహంబు కురంగమౌ విషము దివ్యాహారమే యౌను మే
రువు క్షుద్రమ్మగు ఱాయిగా నవును శత్రుండైన మిత్రుండగా
నవు నిన్ భక్తి భజించువారలకు దేవా సత్యనారాయణా!

మ॥ ఇదియే నాదొకవిన్నపంబు విను తండ్రీ! సర్వకాలంబు నీ
పదపంకేరుహచింతనామృతరసాస్వాదంబునే యిచ్చి నా
మదిలో సత్యము, ధర్మచింతనము ప్రేమన్ సాధుసాంగత్యసం
పద నిత్యంబు నొసంగ వేడెదను దేవా! సత్యనారాయణా!

మ॥ అవయోగంబు లవెన్ని కల్గినను నీయత్యంతకారుణ్యసం
భవపీయూషము నాను భక్తులకు దేవా కష్టముల్ కల్గునే
భువి నీతత్త్వమెఱుంగలేక కడుబాముల్ చెందు జీవాళికిన్
జవి చూపంగదె నీకృపారసము నిచ్చల్ సత్యనారాయణా!

మ॥ తలఁపుల్ చేతలు నీపయి న్నిలిపి నిన్ ధ్యానింతు సద్భక్తిఁ
బొంగులువారన్ జెలికానిగా గురునిగాఁగూర్మిన్ సుహృద్వ
ర్యగాఁ జలి నిక్షేపముగా సురద్రుమముగా లావణ్యవారాశిగా
నిలువేల్పుందొరగాఁగ నెప్పుడును స్వామీ! సత్యనారాయణా!

మ॥ అటుకుల్ గుప్పెడొసంగు విప్రుపయి నత్యంతాద్భుతిన్ జూపి
మిక్కుటమౌ కల్మలొసంగవే, శబరి నీకున్ జుష్టమౌ పండులు
త్కటమౌ భక్తి నొసంగ వానిఁగొని మోక్షప్రాప్తిఁ జేకూర్చవే
పటువాత్సల్యనిధాన ! సద్గుణకలాపా ! సత్యనారాయణా !

శా॥ ఏపాదమ్ములు గొల్చునింద్రుఁడజుఁడెద్దేపాదముల్ మ్రొక్కుఁడా
నేపాదమ్ములఁబుట్టె గంగ భృగుఁడెందేపాదముల్ మట్టెఁడా
యేపాదమ్ముల నాతియయ్యె త్రిదివం బీజాలు నేపాదముల్
ఆపాదమ్ముల నాత్మలోఁదలఁతునయ్యా ! సత్యనారాయణా !

మ॥ కవితామాధురి గ్రోల జాలును రసజ్ఞశ్రేష్ఠుఁడే గాని మా
నవు లెల్లన్ గ్రహియించఁ జాల రెటులన్నన్ ఫుల్లకల్హారసం
భవమాధ్వీకము షట్పదం బొకఁడె నాస్వాదింపఁగా గల్గు గా
కవురా ! యీగకు శక్యమౌనొకొ ? యనంతా ! సత్య !

మ॥ జలరాశిం జనియించు నుప్పన నొనర్పంబడ్డ యాబొమ్మయా
జలరాశిం బడి లోతు గన్గొనగ నెంచన్ బోవ నద్దానిలో
పల లీనంబగు మాడ్కి శుద్ధమగు జీవన్మూర్తి నీలోననే
గలియుణ్ చేరును రూపుమాపుకొని వేడ్కన్ సత్య !

మ॥ అల తారావళి రాత్రికాలమునయం దభ్రంబునన్ దోచు నా
వల భానుండుదయింప కన్పడక బోవన్ వాని లేవందుమా ?
చలదజ్ఞానవశంబుచేత నిను గాంచన్ లేక దేవుండు లేఁ
డిల నంచున్ వచియింపఁగా దగునొకో? శ్రీసత్యనారాయణా!

మ॥ కనకం బొక్కటె దానిచే రకరకాల్గా వస్తువుల్ సల్పు తీ
రున, నీవొక్కడవైన పెక్కులగు పేరుల్ పెట్టినిన్ భక్తితో
డను "అల్లా! వరజీసనూ! గరళకంఠా! కేశవా" యంచు వే
డ్కను బూజింతురు భిన్నభావనలతోడన్ సత్యనారాయణా !

మ॥ తలఁపన్ బాదరసంబుతోఁ బరగు పాత్రం బడ్డ సీసంపు తు
న్కలు తత్పాదరసమ్ములోఁ గరగు చందం బట్లు జీవాత్మ యిం
పలరన్ వైళమ బ్రహ్మసాగరమునం బడ్డట్టి యవ్వేళ తా
నలవ్యక్తిత్వము గోలుపోవుగద దేవా ! సత్యనారాయణా !

మ॥ కనకమ్మున్ గ్రహియించువాంఛ మదినెక్కాలమ్మునన్ బూని, దా
నిని బొందన్ దపియించులోభివలెపూన్కిన్ మానవుండాత్మలో
నను నీపాదపయోజధామమును జెందన్ నిత్యయత్నమ్ము లె
ల్ల నొనర్పన్ వలె భక్తితోడ నహితల్పా! సత్యనారాయణా !

శా॥ చిత్తాకాశమునందు వాంఛలను సుస్నిగ్ధంపు మేఘమ్ము లు
ద్వేత్తున్ రేగిన యంతకాలమును నిన్ వీక్షింప శక్యం బొకో?
చిత్తం బెప్డు ప్రశాంతమై, మధురమై చింతాసుదూరమ్ముగా
హత్తింపంబడువేళ నిన్గనును గాదా ! సత్యనారాయణా !

మ॥ వరదా ! తావకపూజసల్పని కరద్వంద్వంబు లేలా ! భవ
చ్చరణధ్యాన మొనర్పఁజాలని మనశ్చాతుర్య మేలా ! భవ
చ్చరితోదంతముఁ గ్రోలఁజాలని శ్రవస్సౌందర్య మేలా! నినున్
సరగన్ గాంచని కన్ను లేల పరమేశా! సత్యనారాయణా !

మ॥ అనగా జేయుము నోటిచే నెపుడు భవ్యంబైన నీసంస్తుతుల్
వినగాఁ జేయుము కర్ణపర్వముగ నీ లీలావినోదంబులన్
గనగాఁ జేయుము నీదు రూపమును నాకందోయికిన్ విందుగా
మనగా జేయుము నీదు దాసునిగ సౌమ్యా !సత్యనారాయణా !

శా॥ నాకన్నన్ దురితాత్ము లీజగతి గానన్ రారు భావింపఁగా,
నీకన్నన్ గరుణాప్రపూర్ణు లిల లేనే లేరు తర్కింపఁగా,
నాకే చెల్లును మొండిపట్టుదల నిన్ బ్రార్థించి వేధింపఁగా
నీకే చెల్లును నన్నుఁ బ్రోవ గుణకంఠీ ! సత్యనారాయణా !

మ॥ అనుమానం బనుమాటలేక హృదయాహ్లాదంబు సంధిల్లగా
దినముల్ రాత్రులు నీపదాబ్జములు భక్తిన్ జిత్తమందుంచి వే
డ్కను వర్ణించితి సంతరించితి నమస్కారంబుఁ గావించితిన్
ననురక్షింపగ వేడుకొందు బుధమాన్యా ! సత్యనారాయణా !

మ॥ నను పోషించెడునట్టి భారమును, న న్గాపాడు భారంబు పై
నను రోగాదులపాలుగాని భరమున్ మర్యాదకుంభంగ
మొంచని భారమ్ము వహించి నన్ను నొకకంటన్ జూడ
నర్థింతుఁ బేర్మినినున్ "బాపనియాశబండెడుకదా!" శ్రీసత్య॥

మ॥ "పగిడీ చుట్టగ నేర్వలేక పరికింపన్ బుట్టువంకన్న" య
ప్పగిదిన్ మూఢుఁడు నిన్నుఁగన్గొనుట కావంతైన యత్న
మ్ములొప్పంగఁజేయన్ గమకింపకీర్ష్య మెయిఁదెల్పున్ ధాత్రిలో
వెన్నగా భగవంతుఁడు హుళక్కియంచు సహితల్పా! సత్య!

శా॥ నానాక్లేశసమన్వితం బయిన జన్మం బందు నిష్కామక
ర్మానుష్ఠానము వేదశాస్త్ర మత ధర్మారాధనా మోదసం
ధానమ్మున్ భవదీయ దివ్యచరణధ్యానమ్మునుం గల్గి బ్ర
హ్మానందమ్మును బొందరే జనులు దేవా! సత్యనారాయణా!

మ॥ పవలున్ రేయియుఁ దీఱరాని పరితాపజ్వాలలం మ్రగ్గు నీ
భవకూపమ్మునఁ జిక్కి పొక్కెడు జనవ్రాతమ్ము గట్టెక్కఁగా
భవదంఘ్రిద్వయ చింతనామృత రసాస్వాదంబునం గాక, ధా
త్రి విచారింపఁగ నొండుత్రోవ గలదా! శ్రీసత్యనారాయణా!

మ॥ నిను సారధ్యముజేయుమంటినో, గిరిన్ నీమూపుపై మోయుమం
టినో, నే నెంగిలిపండు లిచ్చి తిను తింటేగాని కాదంటినో,
నిను నావాఁకిలి గావుమంటినొకో? తండ్రీ! ప్రేమఁజిప్పిల్లన
న్ననునిత్యమ్మును గావుమంటిని గదయ్యా: సత్యనారాయణా!

మ॥ భవరోగమ్ములనూడ్చు మందు, త్రిదివవ్రాతమ్ముకున్ బొందు
దైత్యవరాసీకము పాలి కుందు మునిసంతానమ్ముకున్ విందు
భక్తవరిష్ఠంబగు మేల్పసందు, నపరాధశ్రేణికిన్ సందు, ని
త్యన్ భూతోన్నతి నందు నివిదలఁచు మాత్రిన్ సత్య!

మ॥ గ్రహదోషమ్ములు, దుర్నిమిత్తములు నిస్గాఢంపు సద్భక్తిఁ బ్ర
త్యహమున్ గొల్చెడు నట్టిసజ్జనుల చెంతన్ జేరి బాధించునే?
గ్రహరాజున్ వడిఁజుట్టి మేఘములు వీఁకన్ నిల్చునే నీయను
గ్రహమున్ గల్గిన నన్ని చక్కఁబడు నౌరా! సత్యనారాయణా!

మ॥ కరిరాజున్ గరుణించినావు, మునిరక్షన్ జేసినా వీవు ని
ట్చరరాట్సూనుని గాచినావు, ద్రుపక్ష్మాజాత మానంబు ని
ద్ధరఁ గాపాడినదైవ మీవు కరుణాదక్షుండ వన్నట్టి మేల్
బిరుదుం దాల్చిన జెట్టి వీవు సుగుణాబ్ధీ! సత్యనారాయణా!

శా॥ నా కష్టంబులు, నాదు మొఱ్ఱలటుపై నా భావసందోహము
ల్నీకుం దక్కఁగ లాఁతివారలకు విన్పింపన్ బరీహాసము
ల్లాకల్యంబుగ సల్పుగాని యొకరున్ సాయమ్ముఁగావింతురే
ప్రాకట్యంబుగ నీవు గాక యనుకంపన్ సత్యనారాయణా!

శా॥ ఏవో వార్తలు వింతలున్ కథలు వైనేవేవొ విడ్డూరము
ల్తావీనుంగవ విందుగా వినును మోదస్ఫూర్తితోఁగాని సం
భావింపన్ నరుఁ డీ భవాబ్ధి తరణోపాయంబు నీపాదరా
జీవమ్ము ల్మది నిల్పి గొల్వఁడు కదా! శ్రీసత్యనారాయణా!

శా॥ ఈయిల్లీ ధనధాన్యము ల్సుతులు నీయిల్లాలు నీబంధు రే
యా యాప్తుల్ మెయియుండునంతవఱకే యాపైని నెవ్వార లా
ఛాయన్ జూడరు, గాని నీదు పదపూజాభాజనంబౌ ఫల
శ్రేయం బొక్కటె తోడునీత యగుసూ! శ్రీసత్యనారాయణా!

మ॥ కరవాలంబులు శూలకుంతశర చక్రప్రాసవజ్రాయుధో|త్కరఘా
తమ్ముల భంగమొందని మహోద్యత్పాపశాఖాళి త్వ
త్కరుణాపూర్ణ కటాక్షసంతతులచేతన్ నేలపైఁ గూలవే ?
పరమాశ్చర్యము నీవిలాసములుగావా ? సత్యనారాయణా !

శా॥ ప్రారబ్ధం బది తప్ప దైనను భవత్పాదాబ్జమాధ్వీఝరీ
ధారన్ త్రావి తరించు భక్తులకు తత్ప్రారబ్ధ బాధావళుల్
దూరంబై చనునంచుఁ బెద్ద లనరే తోడ్తోన యుష్మత్కృపా
శ్రీరమ్యున్ బొనరించు నన్ను దయతో శ్రీసత్యనారాయణా!

మ॥ కరి యేకాన్క యొసంగె నీకు, ద్రుపదక్ష్మాజాత యేమిచ్చెనా
నరుఁడేపాటి ధనం బొసంగె ధ్రువుఁడే నాణ్యేష్టు లర్పించె నా
సురవిద్వేషితనూజుఁ డేమొసఁగెనో సొంపారగాఁ దెల్పు మా
సరణిన్ నేనును నిన్ను గొల్తుఁ బరమేశా! సత్యనారాయణా!

శా॥ కాంతాసౌఖ్యముగోరియో సుతుల సౌఖ్యస్ఫూర్తి నర్థించి యో
మంతుల్ కూర్చెడిభోగభాగ్యమహిమన్ బల్మారువాంఛించి యో
స్వాంతం బందున నెంత్రుగాని యకటా సాయుజ్య మిమ్మంచున
త్యంతార్తిన్ నిను వేడబోవరు గదయ్యా! సత్యనారాయణా !

మ॥ ధనధాన్యమ్ములు నిండ్లు వాకిళులు కాంతారత్నముల్ వస్తువా
హనము ల్తోఁటలు భూమిపుత్రు మొదలౌ నైశ్వర్యముల్గాద నీ
ఘనకారుణ్యమునుండ దాఁక శుభముల్ గై సేయు నామీఁద వం
తను జేకూర్చును గాదె సద్గుణనిధానా ! సత్యనారాయణా !

మ॥ అనఘా! తియ్యని నీటి కాశపడు మత్స్యం బట్లు నాచిత్త మె
ప్పుడు సంసారసుఖమ్ములన్ దిరుగుచుండున్ గాని సాయుజ్యసా
ధనమౌ నీదు పదాబ్జయుగ్మమును చిత్తం బందు నిండారు భ
క్తిని జేరన్ దలపోయ దెన్నడు కృపాబ్ధీ! సత్యనారాయణా!

మ॥ చినవాఁడైనను పెద్దవాఁడయిన సుశ్రీమంతుఁడేయైన ని
ర్ధనికుండైనను ధీయుతుండయిన మందప్రజ్ఞుఁడేయైన పె
ద్దనృపుండైనన్ భిక్షకుండయిన భేదం బించుకన్ జూపఁ బో
వని దేవుండవు నీవు భక్తజనకల్పా! సత్యనారాయణా!

శా॥ మేనుల్బుద్బుదములు సిరుల్ మెఱుపులౌ, మీసాలపై తేనియల్
నానాభోగములౌ, సతీసుతులు వంత ల్గూర్చు సచ్ఛాత్రవు
ల్జానౌ విశ్వము హేయమైన మృగతృష్ణాప్రాయమం చెంచువి
జ్ఞానుల్ నిన్ను గొల్తురెప్పుడు శుభాంగా! సత్యనారాయణా!

మ॥ వ్రతము ల్సేయుటలేదు, నీగుణము ల్వర్ణింపఁగాలేదు, క
ర్మతతిన్ జేయఁగలేదు. కానయిన ధర్మం బీయఁగాలేదు సం
తతమున్ నీపదసేవఁజేయుటను నాతప్పుల్ వడిన్ ద్రోచి దు
ర్గతులం బాపఁగవేడికొందు సకలంకా! సత్యనారాయణా!

మ॥ పతితుండైనను దావకీనవిలసత్పాదారవిందద్వయిన్
మదిలో నిల్పి నిమేషమైన నిను సంప్రార్థించినన్ జాలు స
మ్మతితోనాతనిపాపముల్ మనిమి సమ్యక్ప్రీతితోమోక్షసా
ఖ్యాతతు ల్గూర్చెదు సట్టి వేల్పువుగదయ్యా! సత్యనారాయణా!

శా॥ నీవేతప్ప నితఃపరంబెఱుఁగ తండ్రీ! నన్ను మన్నింపవే
రావే కావవె యంచు నెవ్వఁడు నినున్ బ్రార్థించి సేవించునో
యావానిన్ దగు మారురూపమున బ్రేమాయుక్తచిత్తంబుతో
కావం జూతువుగాదె భక్తజనరక్షా! సత్యనారాయణా!

శా॥ ఈక్షోణిన్ నినుఁ బోలు త్రాతలిఁక లేనే లేరు భావింపఁగా
నీక్షోణిన్ ననుఁబోలు దీను లిఁక లేనే లేరు కాఁబట్టి నీ
యక్షీణామృతపూరపూరితకటాక్షానీకముల్ నింపి నన్
రక్షన్ జేయు మటంచు వేడెద నుదారా! సత్యనారాయణా!

మ॥ మదులన్ మాన్యము లీయమంచును నినుం బాధింపఁగా లేదు
నాఁయిడుమల్ పాపుచు నాదరించుమని యెంతేవేడగా లేదు
నీఁయడుగుల్ రెండును నాదుచిత్తమున నాప్యాయంబుతో
నిల్పు. నిల్కడగా నిత్యమటంచు కోరెద శుభాంగా! సత్య!

మ॥ అభిమానించుచు నాదరించు ప్రభు పీపంచున్ దయామూర్తి ని
న్నభిషేకించితి మామకీన కవితాత్యంతాఽమృతస్ఫూర్తితో
డ భయార్తున్ నను జేరఁదీసి వడి గాఢంబైవ సత్ప్రేమ నిం
చి, భవాబ్ధిం మునుగంగనీయకుమయా! శ్రీసత్యనారాయణా!

మ॥ పలుకుల్ తీయనితేనెలూర, కరుణాభావంబు లేనవ్వు మో
మలరింపన్ గనులందు శాంతమును మిట్టాడంగ నెంతేనియున్
దులువల్ వేసెడివేషముల్ మదిని నెంతోనమ్మి ప్రాజ్ఞుల్ సదా
సిలుగుల్ బొందుచు నున్నవారు గుణరాశీ! సత్యనారాయణా!

మ॥ పనియున్నప్పుడు చూపుశాంతము, కృపాభావంబు మర్యాద తి
య్యనితేనెన్ మరిపించు మాటలును, కార్యాంతంబునం దేరు
వా నిని బాటించరు, మోసకారులకు నెంతే నాకరంబైన ధా
త్రిని ధర్మమును నిల్పవేడెద మురారీ ! సత్యనారాయణా !

మ॥ యతులన్నన్ దలనొప్పి, ప్రాసమన నత్యంతార్తి సల్లక్షణా
న్వితులం దేవము, సద్రసం బనినచో వెక్కిళ్ళు నాలంకృతి
ప్రతతుల్ భారముగా సమాసమనగా పైశాచిగా నెంతు రీ
క్షితిలో నేఁటి నవీనకాకవులహో ! శ్రీ సత్యనారాయణా !

మ॥ గురువన్నన్ గుఱిలేదు మీఁద భయభక్తుల్ లేవుగా పెద్దలం
దు, రహిన్ బాఠములా పఠింపరిఁక సందుల్ గొందులం దిర్గు
చున్! గురుగర్వంబున నేఁటి బాలకులహో 'గుండాలు'గా మా
రుచుండిరి వీరిన్ మఱి బాగుచేయు టెటు? తండ్రీ! సత్య !

శా॥ జంకున్ గొంకును లేక వర్తకులు స్వేచ్ఛామూల్యముల్ నేఁడు
ని శ్శంకన్ బెంచగ, దాని నాపగల సత్సంకల్పమున్ లేక
యా వంకన్ జూడక మంత్రిశేఖరులు చేవల్ దక్కియున్నారలీ
వింకన్ వైశమ దీని నాపుము కృపాబ్ధీ! సత్యనారాయణా !

మ॥ నిజమాడన్ గడు నిష్ఠురం బగును గానీ నేను నీముందటన్
నిజమే పల్కెద నాలకింపు మిఁక మంత్రిశ్రేణి లీలాఁడుభూ
ప్రజ సుక్షేమములన్ దలంపకకటా స్వార్థంబులో నుంటచే
ఋజుమార్గంబుల బూజుపట్టెను సుమీ! శ్రీసత్యనారాయణా!

మ॥ తమ యీ మేనులు శాశ్వతమ్ములని నిర్ధారింతురో లేక పై
తమజీవమ్ములు వోవువేళను నిజద్రవ్యమ్ము మూర్ఖాళి మొ
త్తముగా వెంటను వచ్చు నంచునొ దయాదాక్షిణ్యముల్
వీడి। విత్తముకై నిత్యము దేవులాడుదు రసంతా! సత్య!

మ॥ సమయం బక్కరలేదు ముందుగను పెన్షన్ చీటి నంపించు నే
మములం గోరవు యోగ్యతాదు లనుకంపన్ దెల్పు సంశ్లాఘ్య
పత్రము లాశించవు భక్తి నమ్రిత నినున్ ధ్యానించినన్ జాలు
సౌమ్యముతో వారల బ్రోచు వేల్పువు గదయ్యా! సత్య!

మ॥ శతకంబన్న నిరాదరంబు గుణసంపన్నములౌ కావ్యసం
తతులన్నన్ బరిహాస మాపయిని నిత్యస్తుత్యనీతిప్రభాస్వత
కోశమ్ములయందు నేవమును నెంతేఁ బొందు హిందూప్రజా
తతులన్ ధర్మపుపుంతఁ ద్రిప్పు పరమాత్మా! సత్య!

మ॥ అవనీమండలమందనాయిత యశోవ్యాప్తిప్రకాశుల్ ధరా
ధవులే మ్రగ్గిరి కాలగర్భమున కీద్రవ్యంబు లీమేని పై
భవముల్ సర్వము శాశ్వతం బనుచు లోభావింతురే కాని యి
య్యవి నిత్యమ్ములుగావటంచెఱుగరయ్యా! సత్యనారాయణా!

మ॥ కలికాలం బిది "దేవునై గురువునై" కాఁబట్టి నాబోటివా
రలె నీయున్కి దృఢీకరింపఁ దగువారల్ కాన నామీఁద నీ
లలితామేయకృపా కటాక్షతతులెల్లం బర్వెఁ రక్షింపు మా
పల నీకీర్తియు మిన్నుముట్టగలదప్పా! సత్యనారాయణా!

మ॥ ఇలలోఁబుట్టిన దానికిన్ ఫలము నూఱేం డ్లుండినన్ మీఁద ల
క్షలు లక్షల్ గడియించినన్ నిలుచునే గాత్రింబు నుంతేని భూ
స్థలిలో నెవ్వని పేరు శాశ్వతముగా శ్లాఘ్యమ్ముగా నిల్చునో
అల వాఁడే మృతజీవుఁడౌనుగద యన్నా ! సత్యనారాయణా!

శా॥ ధర్మంబుల్ కడు దర్వ్యసాధ్యములుగాదా! మీఁద యజ్ఞాది స
త్కర్మశ్రేణులు కూడ కష్టతరమౌ కార్యమ్ములేగన నే
నిర్మాలిన్యముగా మెలంగు హృదితో నీపాదపద్మమ్ములన్
మర్మంబుండని భక్తితోఁగొలుతు సుమ్మా! సత్యనారాయణా!

శా॥ నాచేతన్ భవదీయసత్కృతులు పన్నంజేయుమా నిత్యమున్
నాచేతన్ భవదీయపాదభజనానందంబు నొందింపుమా
నాచిత్తమ్మిఁక నీనివాసముగ నుండన్ జేయుమా మీఁదటన్
బ్రాచుర్యంబుగ నన్ను నేలుము దురాపా! సత్యనారాయణా !

శా॥ నీరోగత్వ చిరాయువుల్ సుఖము నిర్ణిద్రాద్వయజ్ఞాన సం
స్కారంబున్ యశమున్ గుణోజ్జ్వలతయున్ సత్పుత్త్రిలంగూర్చి
సర్వారిష్టమ్ములదూల్చిభూప్రజకు నత్యానందముం గూర్చు
దీ। వౌరా! నిన్ను స్మరించుమాత్రమున దేవా! సత్య!

మ॥ అమలస్వాంతముతో ననన్యమతితో ధ్యానించు నీభక్తు బా
పము లెక్కింపక వానినన్నిటి పటాపంచల్ వడిన్ చేసి యు
క్తముగావాని "యహమ్ము"నుంగెడపి మోక్షప్రాప్తి చేకూర్చు
దై। వము నీ వేగదయ్యా! భక్తజనజీవా ! సత్యనారాయణా !

మ అనృతం బాసయు, నీసు, మోసముఁ బరార్థాపేక్ష, క్రోధమ్ము లెంతయు నన్నంటకయుండ జూడు మదియందున్ నిత్యసంతృప్తి శాంతిని, దాంతిన్, ఋజుమార్గవర్తనములన్ నీపాద పద్మార్చనా జనితానందగుణమ్ము లిమ్ము పరమేశా! సత్య !

మ॥ అలయం "బాంధునకడ్డు లాముడలుగా" నౌనట్లు నానాఁటికిం బలువంతల్ పడుచున్న నాకిఁకను దేవా! నీవనారోగ్యముం గలిగించన్ వడి న్యాయమౌనె, జనరక్షాదక్ష! యుష్మత్కటాక్షలవం బించుక దీనునైఁ బరపు వేగన్ సత్యనారాయణా !

శా॥ లేరే వేలుపు లెందరేని యిలలో లెక్కింప నవ్వారిలో నేరీ నీవలె భక్తరక్షణ కళోత్సేకంబుతో నొప్పుచున్ గారుణ్యంబును పాత్రిభవంబు, మతమోక్షం బిచ్చు సామర్ధ్యసంభారమ్ముల్ కలవార లుండిరె? మహాత్మా! సత్యనారాయణా !

మ॥ తనరన్ సర్వసుపర్వులందు పరతత్త్వంబైన బ్రహ్మంబు భావనచేయం గెవఁడంచుఁబల్కఁగ "నదైవం వాసుదేవాత్పరం" బని సన్మౌనులు పల్కినారుగద దేవా ! యట్టి దేవుండవౌ నిను వర్ణింప వశంబె నాకు గుణకంధీ ! సత్యనారాయణా !

మ॥ పరులన్ బాధలముంచి లంచముల సంపాదించి బల్గొప్పకొద్ది రహిన్ జేసిన యట్టిధర్మములుఁ బూదింబోయు పన్నీరు తీరరరే పొందును గాని సుంతయును పుణ్యప్రాప్తిఁ జేకూర్చునే స్థిరతం బొందునె నీప్రశంసలగునే శ్రీసత్యనారాయణా !

మ॥ వ్రతనిష్ఠన్ బహుదానధర్మములు దివ్యక్షేత్రయాత్రావళుల్
స్మృతిధర్మమ్ము లొకింత నేనెఱుగ తండ్రీ! గాని సద్భక్తి న
మ్రతతోఁ దావక పాదపద్మయుగముం బల్మారు లంగొల్చు చుం
గతి నీవే యని నమ్మినాఁడ సురరక్షా ! సత్యనారాయణా !

మ॥ కపటం బింత యెఱుంగ నీపదము లెక్కాలంబుఁ బూజించెదన్
గృపకుం బాత్రుఁడ నీదు భక్తుఁడను నిన్నే నమ్మి
యున్నాడ నాత్రపలం బాపుచుఁ గంటి తెప్పగతిగా రక్షింపు
మంచున్ నినున్। విపులానంద మొసంగ వేడెద కృపాబ్ధి! సత్య!

శా॥ ప్రారబ్ధం బనుభూతమౌ ననుచుగా వాకొందువో దాన నా
ప్రారబ్ధం బెటుపాయునం చనెదవా బాగ్బాగు నీకున్న స
త్కారుణ్యామృతవార్ధియన్ బిరుదు నిక్కం బెట్లగున్ గాన నీ
పేరున్ నిల్పుము నన్నుఁ బ్రోచి కరుణాబ్ధీ ! సత్య !

మ॥ తనయుం డజ్ఞతఁ జల్పినట్టి యపరాధంబుల్ విలోకించి త
జ్జనకుం డోర్మి క్షమించు చందమున నజ్ఞానమ్ముచే నే నొన
ర్చిన దోసంబుల నెల్ల సైఁచి కరుణాదృష్టిన్ బ్రసారించి న
న్ననుకంపన్ బరికించుమయ్య ! దురితఘ్నా ! సత్య !

శా॥ శ్రీదంబై, శ్రితలోకతాపహరమై, చింతామణీప్రాభవం
బై, దివ్యంబయి. సర్వమౌనికుల సేవ్యంబై, జరామృత్యుజ
న్మాదివ్యాధివినాశకంబయిన నీధ్యానామృతస్వాదనా
మోదమ్మున్ ఘటియించు నిత్యము స్వయంభూ ! సత్య !

మ॥ ప్రతిఘసర్గంబున కేశవా ! శుభకరా ! బ్రహ్మాదిదేవేశ్వరా !
ధృతచక్రాయుధ! భక్తవత్సల! హరీ! దీనావనా యంచు భ
క్తితలిర్పన్ భవదీయకీర్తనము రక్తిన్ జల్పినన్ దత్పురా
కృత పాపౌఘముఁ బాపి ముక్తి నిడవే ! శ్రీసత్య !

మ॥ కననీకయ్య క్షణంబు నిన్నుఁ బొగడంగా లేని పాపాత్ములన్
విననీక య్యొకమారు నీకథ వినా వేరైన గాథావళిన్
జననీకయ్య రమేశ! నీమహిమమున్ గర్హించు దుర్గోష్ఠికిన్
మననీకయ్య భవత్సపర్యవిడి యుండన్ సత్యనారాయణా !

శా॥ శ్రీమత్తావక పాదపద్మయుగళ శ్రీపాంసువుల్ మస్తక
స్థ్సీమన్ నిల్పుము నీదు లీలలను వాసిన్ వ్రాయు భాగ్యమ్ము
లో!స్వామీ! నాకడు దాన దాటుదును సంసారాబ్ధిఁ బైఁద్రుంచెదన్। గామక్రోధముఖాదిషట్కము లనంతా ! సత్య !

మ॥ సరిదుత్తుంగ తరంగహస్తములతో జానొప్పు గంభీరసా
గరతీరమ్మున నిల్చి యొక్కఁడు తరంగాల్ పోయినన్ స్నానస
ద్వరకృత్యమ్ములు సల్పువాఁడ నను చందం బేను సంసారసా
గరముం దాఁటి నినుం దలంచు టకలంకా! సత్యనారాయణా!

మ॥ మడిమాన్యమ్ములు మాడువుల్ సిరులు సంపత్తుల్ మణీభూష
లున్। గడిదుర్గమ్ములు శాశ్వతమ్మ లనుచున్ జ్ఞానుల్ లవం
బెంచరె। ప్పుడొయొక్కప్డివి పోవునం చని; ఖిలంబున్ గానిసత్తా
వ్యమే। పుడమిన్ శాశ్వతమౌచు నిల్చుగద యెప్డున్ సత్య !

మ॥ కృపకుం జోటు, పతివ్రతాత్వమునకుం గేహంబు భక్తావళీ
త్రపలం బాపెడు వేల్పుచెట్టు, సిరికిం ధామమ్ము దీవ్యచ్ఛ భా
విపులత్వమ్మున కాటపట్టు సుగుణావేశ్మంబు నీజాయ వే
లుపు ముత్తైదువయైన యిందిర దయాళూ! సత్యనారాయణా!

మ॥ నినుఁగీర్తించుచు నీయశమ్ము వినుచున్ నీపాదపద్మార్చనా
జనితానందముఁడ నొందు నీసుగుణముల్ చర్చించుచున్ నీదుభ
క్తనికాయంబుల సేవఁజేయు చనురాగస్ఫూర్తి నీమూర్తి నే
మనమం దెప్పుడు నిల్పునట్టి వరమిమ్మా! సత్యనారాయణా!

మ॥ దురితాచారులు, మోసకారులు మహాదుర్గర్వులుం గష్టులున్
బరవిత్తాపహారుల్, కిరాతకులు డంబాచారులున్ దుష్టులున్
గురువిద్రోహులు నీతిదూరులు మహాక్రూరాత్ములున్
శత్రులౌ ద్దిర లేకుండగఁజేయుమీ భరతధాత్రిన్ సత్య!

మ॥ జలసంక్షోభము లీతిబాధలును సస్య శ్రేణినాశంబు లు
జ్జ్వలభూకంపములున్ బరాభవంబు లటుపై వాయ్వగ్నిచోరా
దిబాధలు మాభారతజాతి కించుక నలంతం గూర్పకుండంగగ
నుజ్జ్వలప్రేమన్ గనుమయ్య భక్తజనరక్షా! సత్య!

మ॥ అతిధి బ్రాహ్మణ దేవపూజన విశిష్టాచారసంపత్తి చే
బ్రతతాధ్యాత్మిక దివ్యసంపదలచే భాసిల్లు దానాళిచే
శ్రుతిశాస్త్రంబులచేఁ బతివ్రతంచే శోభిల్లఁగాఁ బుణ్యభా
రతదేశంబును బ్రోవవే కరుణమీఱన్ సత్య!



శా॥ స్వాతంత్ర్యమ్ము చి నేఁటికిని నీకా! పూర్వదై దేండ్లు సం
ప్రీతిన్ సిల్వరుజూ నిపి రాజ్ఞాను లౌవార లీ
స్వాతంత్ర్యమ్మున కెట్టిభ సొవంతైన రాకుండ సం
జాత ప్రేమను బ్రోవవేడెద రమేశా! సత్య !

మ॥ అభివర్ణించితి చేతనైనగతి పద్యశ్రీలతో నిన్ను నో
ప్రభువా! దీన నలంకృతుల్ యతులు నాప్రాస సలక్షణ
ప్రభవాల్ కల్గిన కల్గకున్న కరుణాపారీణతన్ జూపి స
ద్విభవంబున్ పొనఁగూర్చు మత్కృతికి పృథ్విన్ సత్య !

మ॥ మతిమంతుల్ కవిసార్వభౌములు సుధామాధుర్యవాక్పాతురీ
లత సద్ప్రజ్ఞను పద్యమాలికలచేతన్ నిన్ను రంజింప; స
మ్మతిగా నీయెడ దోషదూషితవచోమాలన్ దగన్ వేయు న
జ్ఞత మన్నించి కృతార్థుఁ జేయు ముచిశక్షా! సత్య !

మ॥ జనసంఘమ్ము పఠించుమాత్రమునసే సంతోషపుం గూర్ప జా
లిన సద్భక్తిరసంబులుం గలిగి నీలీలావిలాసంబులన్
దనివారన్ మధురోక్తి గూర్చిన కవిత్వంబే కవిత్వంబు నా
నని పెద్దల్ వచియింత్రుగాదె? శ్రుతిగణ్యా! సత్య !

మ॥ జయకృష్ణా! జయకేశవా! జయరమేశా! దుష్టశిక్షావ్రతా!
జయవిష్ణూ! జయచక్రపాణి! జయవిశ్వవ్యాప్తనారాయణా!
జయశౌరీ! జయపద్మనాభ! జయవిష్వక్సేన! శిష్టావనా!
జయపీతాంబర! వాసుదేవ! కమలాక్షా! సత్య !

మ॥ ఫలమో పుష్పమొ పత్రిమోజలమొ సద్భక్తిన్ బ్రసాదించు భ
క్తులకుం వాంఛిత సర్వసౌఖ్యములుబల్కూర్మిన్ గటాక్షించు
చు। జ్జ్వలపుణ్యంబును శాశ్వతం బయిన మోక్షప్రాప్తిఁ జే
కూర్చు వ। త్సలతాపూర్ణుఁడ వీవుగాదె పరమేశా! సత్య!

మ॥ జనులం దెల్లెడ స్వస్తి, మంత్రితతికిన్ సత్పాలనాపుష్టి, మీఁ
దను గోవిప్రముఖాదిజాతుల కనంతంబైన సంతుష్టి, చ
క్కని సస్యంబుల సృష్టి యిచ్చి కరుణాగారుండవై భారతా
వని కేనష్టియుఁ గల్గకుండ గను మప్పా! సత్య!

మ॥ సిరులో మాడలో మేడలో పశువులో క్షేత్రమ్ములో దోఁటలో
కరులో గాంచనమో తురంగతతులో గాంక్షించి యీ పద్య
ముల్। వరుసన్ గోరి పఠించువారలకు నవ్వానిన్ బ్రసాదించు
మీ। వరదా వైశమ వాంఛితార్థజనకల్పా! సత్య!

శా॥ దేవా! మంగళ మంబుజాక్ష! కరుణాబ్ధీ! మంగళం బచ్యుతా
భావాతీతసుమంగళంబు నుతసాంబా మంగళం బవ్యయా
దేవారాధితమంగళంబు గుణకంఠీ మంగళం బక్షరా!
శ్రీవక్షస్థితమంగళంబు గొనుమా! శ్రీసత్యనారాయణా!

మ॥ వ్రతరాజమ్ములఁ దావకీనముగదా భాస్వద్వ్రతం బెన్న దై
వతవర్గమ్ములలోన భిన్నయగు దైవం బీవె యాదంచు స
మ్మతి మూలాన్వయ పేరనాభిదుఁడస్వామీ! నీపయిన్ భక్తితో
శతకమ్మున్ రచియించినాఁడ గొను మీశా! సత్యనారాయణా!

# శ్రీ రామప్రభు శతకము

శా॥ శ్రీమాణిక్య విభా విరాజిత బృహత్సింహాసనాసీను, సు
త్రామాంభోజ భవాది దైవతకృతధ్యానున్, గుణాధీను, ర
క్షో మాతంగ మృగాధిపోజ్జ్వల కథాశ్లోక ప్రతిధ్వాను, ని
ష్కాముని నే నినుఁగొల్తు నీకిదె నమస్కారంబు రామప్రభూ!

శా॥ శాంతంబై, యకళంకమై, సుజనరక్షాకాంతమై, సద్గుణా
క్రాంతంబై, నిలయీకృతర్షి హృదయప్రాంతంబునై, వేదసి
ద్ధాంతంబై, పరిణవస్థమై వెలుఁగు నీతత్త్వంబు, నా నిర్మల
స్వాంతంబందు వెలుంగుగాత మెపుడున్ సర్వేశ! రామప్రభూ!

శా॥ త్వత్సామర్థ్యము,ద్వత్ప్రభావమును, ద్వద్వాత్సల్యమేనెన్నఁగా
నుత్సాహంపడుచుందు నద్దియెటులౌనో? ప్రాంశులభ్యార్థమం
దుత్సాహంబునఁబొట్టివాఁడు తనబాహుల్ సాచినట్లౌనొ? గో
వత్సన్యాయము సార్థకంబుగ ననున్ బాలింపు రామప్రభూ!

శా॥ తప్పుల్ సేయనివారలుండుదురె యీ ధాత్రీస్థలంబందు, నా
తప్పేమోయెఱుఁగన్ భవాబ్ధిఁబడి యీఁదన్జాలకున్నాఁడ, నే
ముప్పుల్ ముట్టఁగనీక నీదయిన దాపుంజేర్చి కాపాడు మో
యప్పా! భక్తులపాలి చుట్టమవుకావా! నీవు రామప్రభూ!

మ॥ భగవంతుండవు, నిర్గుణుండవు, పరబ్రహ్మంబ, వాద్యుండవున్
నిగమాంత ప్రదిపాద్యమూర్తివి, సుహృన్నీరేజ విస్ఫూర్తివిన్
జగదాపన్న మహావ్యథాహరణ దీక్షావర్తివై నట్టి నీ
మొగమున్ జూడఁదలంతు నెప్పుడు స్వయంభూ! యీశ!
రామప్రభూ!

మ॥ తినగాఁగూడును గట్టగుడ్డయు నొకింతేలేక దుఃఖించు నం
దనులన్‌గాంచి తపించు మాభరతమాతన్ జక్కనోదార్పు మో
యినవంశార్ణవ పూర్ణచంద్రమ! సదాయిద్ధాత్రి సస్యాఢ్యమై
ఘనమౌపాడినిగల్గి సంపదలతో గ్రాలంగ రామప్రభూ !

మ॥ ధనికుండీతఁడు, పేదవాఁడితఁడు, విద్వాంసుండు, మూర్ఖుండు, దు
ర్జనుఁడున్ సజ్జనుఁడీతఁడీఁతఁడని యుచ్చైర్నీచ భేదాదు లెం
దును బాటింపక యందఱన్ సమతసంతోషింపగాఁజేయునీ
గొనముల్ సంస్తుతిఁజేయఁగావశమె నాకుందేవ! రామప్రభూ!

మ॥ "కనులన్‌గానక సంభ్రమించుచుఁగడుంగాసిల్లుచున్" ధ్వాంత
మం
దున నెంతేవెతఁజెందు నాతనికిఁదోడ్తో బేటరీ దీప మ
బ్బిన చందంబగుగా భవాబ్ధిఁబడి తబ్బిబ్బైన సంసారికిన్
ఘనమౌ నీపద సేవ యబ్బునెడలన్ గారుణ్య! రామప్రభూ!

మ॥ తలపన్‌దేనియ సోనలన్ జిలుకుకై తన్‌మున్ను కవ్యగ్రణుల్
వెలయింపన్ గనియేను తద్యశము బ్రాపింపంగ నిశ్లైతి "బె
బ్బులి వీక్షింపుచు నక్కవాతలిడుకోఁబోఁబూను నట్లయ్యెఁ,నా
తెలివిన్ నవ్వక, నన్ను నాయుడుత బత్తింజూడు రామప్రభూ!

శా॥ అన్నా! లోకములోన భక్తియన మృగ్యంబయ్యె "నారాయణా
యన్నన్‌బూతగుమాట" యయ్యెనిఁక భక్త్యావేశ సంపన్నునిన్
ఖిన్నుంజేయుచు బాధపెట్టుదురు తత్క్లేశంబుఁబోఁద్రోసి నీ
కన్నన్ బ్రోచెడి వారలెవ్వరు కృపన్‌గాపాడు రామప్రభూ!

శా॥ కన్నుల్ మూసుక పాలుదాగివి, యటులోకంబున్ దనుంగానకే
మిన్
కన్నుల్ మూసుకయుండునంచు మదిలోఁగాంక్షించు మార్జాల మ
ట్లెన్నన్ దానొనరించుపాపము జనంబీక్షింపదంచెంచు మూ
ర్ఖున్నీవే కృపఁబ్రోతువంట ననుఁజేకోవయ్యా! రామప్రభూ !

మ॥ జడివానంబడియేఁగు నాతఁడొకచో సౌధంబువీక్షించి పొం
గెడు మాడ్కిన్ నరుఁడీ భవాబ్ధిఁబడి పెన్ క్లేశమ్ములం జిక్కినీ
యడుగుందామరజాడ చిక్కఁగనె యత్యానందముంబొంది యే
యిడుమల్ ముట్టక ముక్తిగాంచుఁగద భూమీశాన!రామప్రభూ!

మ॥ సరిగా గంట పరిశ్రమించుసరికే శ్రాంతంబగున్మేను స
త్వరమే యింటికిఁబోయి చేరమనసౌఁదర్వాతఁదల్పమ్ముపై
నొరగంగావలె భార్యవీవవలె నిట్లుండంగ లోకంబులన్
బరిపాలింప నలంతలెవ్వియును లేవా నీకు రామప్రభూ !

మ॥ వరుసన్ గమ్మని చంపకోత్పలము లుత్పాదించి వృత్తమ్ములౌ
సరులన్గూర్చి యొసంగమెత్తువఁట తత్సంబంధివృత్తంబులన్
భరతచ్ఛందములన్ భజించెద భవత్పాదాబ్జముల్ భక్తిత
త్పరతన్ బ్రీతుఁడవై గ్రహింపఁగదె సాంబస్తుత్య!రామప్రభూ!

మ॥ అరయన్ జిత్రమునేఁటిలోకులు తపస్స్వాధ్యాయపూజాదు లొ
ప్పరు, జన్మంబుఁదరింపఁజేసికొన సంభావింపరెంతే "కలౌ
స్మరణాన్ముక్తి"యటంచుశాస్త్రము వచింపన్ దానినిన్ జేయబో
వరిఁగేలాగు దరింతురో తెలియదప్పా! నిత్య! రామప్రభూ!

మ॥ నగవుల్ సిందు నమోఘమంగళ చిదానంద స్వరూపంబుతో
జగదాపన్న జనవ్యథాహరణ దీక్షారక్షహస్తంబుతో
నిగమాంత ప్రతిపాదితావ్యయగుణోన్నిద్ర ప్రభావంబుతో
నగుపింపంగదవయ్య నా కనులువిందౌనట్లు రామప్రభూ !

మ॥ అనఘాకొందఱు యౌవనంబుడుగుప్రాయంబందునన్దైవపూ
జనముల్ సేయుటమేలటంచు రిదిలెస్సా చూడ నందాఁక నీ
తనువిట్లే తిరమౌనె? రోగముల బాధల్గ్రమ్మవే "దీపముం
డిన యప్డేయిలు జక్కబెట్టుకొనువాఁడే ప్రోడ, రామప్రభూ!

మ॥ మకరందమ్మను గ్రోలు తుమ్మెదలకే మాత్రంబుగా నీమతొం
డొక చింతావ్యవధానముండనటు నిన్నూహించి ధ్యానించు సే
వకులౌ వారలకన్యవృత్తిఁజరియింపన్ బ్రీతి జన్మించునే
యిఁకనీపై దృఢభక్తి చాలు, నదినాకీవయ్య రామప్రభూ !

శా॥ సృష్టింజేసి జగమ్ములన్నియును సస్నేహాంబుగా వానికిన్
తుష్టింబుష్టి ఘటించి సర్వవిధ సంతోషంబులంగూర్చి, యే
కష్టాలొందగనీక ప్రోచుటను లోకారాధ్యుఁడన్వేరు ని
స్పష్టంబౌగతి నీకె దక్కినది విశ్వత్రాత! రామప్రభూ !

మ॥ మృగతృష్ణంగని వాఃప్రవాహమని యెంతేభ్రాంతికిం జిక్కి చ
క్కఁగ నచ్చోఁజని నిర్జలంబయిన జోకంజూచి యేణంబు నె
వ్వ గలన్ జెందెడునట్లు భౌతికసుఖా భాసంబులన్ నమ్మి మృ
త్యు గుహాద్వారము చెంతఁగూలివడు మర్త్యుండెప్డు రామప్రభూ

మ॥ ఆడియాసంబడి లేనిపోనిపనులెన్నైనన్ మొదల్ పెట్టి యె
య్యెడనేన్ మూఁడుదినాల ముచ్చటలెగా నీ మేలులేకన్నిటన్
సడియన్ సందడి నష్టిముష్టిగని పశ్చాత్తాపదావాగ్నిలోఁ
బడి మర్త్యుండిటు మ్రగ్గిపోవుగద విశ్వస్తుత్య! రామప్రభూ!

మ॥ తెఱపైనెంతయుఁదోలు బొమ్మలనుత్రై తెక్కించు నాడించుచున్
మరలంబేటికనుంచు చందమున నీమాయా మహాశక్తి చే
త, రహిన్‌జీవులనాడ జేయుదువు మీఁదన్ గిట్టగాఁజేయు ది
క్కారణిం జూడగఁజోద్యమయ్యెడు జగత్కళ్యాణ!రామప్రభూ!

శా॥ పేకన్‌బాలుఁడు మేడగట్టి పరమప్రీతిన్ వినోదించి తా
నై కాల్పేతులఁగూలఁదోయుక్రియ నీవై విశ్వమున్ నవ్యసు
శ్రీకంబట్లు సృజించిపెంచి తృటిలో జీర్ణింపఁగాఁజేతు, నీ
దౌ కార్యంబదియేమొ బోధపడదయ్యా! యీశ! రామప్రభూ!

మ॥ పరమాత్మాయని యొక్కమాఱు నినునెవ్వారేని ప్రార్థింప, సం
బరముంజెందుచు వారియాపదలు బాపంజేయు నీయట్టి స
త్కరుణాయత్తమనస్కుఁడీ జగతికిన్ గల్గంగ ఘోరవ్యథల్
దరియన్ నేరవుగాదె భక్తులకు సత్యప్రజ్ఞ! రామప్రభూ!

మ॥ అరిషడ్వర్గము ద్రుంచి,యీజగము మిథ్యాభూతమంచెంచి,యీ
సిరులెల్లన్ క్షణికమ్ములంచుమది నాక్షేపించి, సంసార సా
గరమున్ దాటఁదపించుయోగులును నీకారుణ్య నంసిద్ధికై
నిరతంబున్ నినుఁగూర్మి కొల్చెదరు మౌనిస్తుత్య!రామప్రభూ!

మ॥ పులుఁగుల్ దాముఁరిలోనఁజిక్కి వెలికిన్ బోలేక ఘోరవ్యధా
విలచిత్తంబునఁగుందు చందమున నీవిశ్వంబునంగల్గు జీ
వులుసంసారమహాంబుధిన్ మునిఁగిచావున్ బుట్టువున్ బొందువా
రలె యైపోయిరి దివ్యమూర్తి నినుఁజేరన్ లేక రామప్రభూ !

శా॥ రాగద్వేషతమో విమోహమదవిభ్రాంతి వ్యథాకీర్ణ పా
పాగారంబు భవాబ్ధిలోఁబడిన జీవాళిన్ దయన్ బ్రోవఁగా
రాగంబుల్ దళుకొత్తఁదత్తదవతార ప్రక్రియల్ పూను నీ
త్యాగంబుల్ స్తవనీయముల్ గద! మహాయజ్ఞేశ!రామప్రభూ;

మ॥ సదయా "చల్లకువచ్చి పాత్రమునుదాఁచనేమిలె". నీ్రమోల ను
న్నది యున్నట్లువచింతు. లోవిసముపైనన్ బాలుగాఁదీర్చి నె
మ్మది నన్నుట్టిడునట్టి యీ దురితమున్ మాన్పంగ నిత్యమ్ము నీ
పద పద్మాంచిత భక్తి నిమ్మనుచు నేఁబ్రార్థింతు రామప్రభూ!

మ॥ ధనముల్ కల్గినయప్డు బంధుగణమత్యంతాశ నేతెంచు నా
ధనముల్ పోయినవెన్క నెవ్వరును చెంతంజేరరెట్లన్న ని
ల్వనఁబుష్పించిన వృక్షమున్ దరియునెప్డున్ దేటులాపూఁతరా
లిన మ్రోడుందరిఁజేరవిట్టి కలుముల్ మేలౌనె! రామప్రభూ!

శా॥ నీ నామమ్ములు లెక్కబెట్టుటకుగానీ! నీదురూపం బొకిం
తేనిన్ వర్ణనఁజేసి చెప్పుటకుగానీ! నీదు సామర్థ్య మెం
తేనిన్ లోకమునందు దెల్పుటకుగానీ యోప; షట్ఛాస్త్ర వి
ద్యా నిష్ణాతులకే నసాధ్యము దయావ్యాసంగ! రామప్రభూ!

మ॥ నినుదర్శింపఁగ జాలనట్టి కనులున్ నీపూజలన్ జేయ నో
పని హస్తంబులు, నీదునామము వచింపన్ బోనిదౌజిహ్వ,నీ
కు,నతుల్ సేయని యుత్తమాంగము. నినుంగొల్వంగలేనట్టియీ
తనువేలా! భువిలోన జీవునకు? వ్యర్థంబౌను రామప్రభూ!

మ॥ పొగబండిన్ బయనించువారెచటికిన్ బోనెంతురో యచ్చటన్
దిగుచున్ గార్యముఁదీర్చి యెక్కుగతి నెంతేకర్మబద్ధుల్ జనుల్
జగతిన్‌బుట్టుచు జచ్చుచుందురుగదా! సర్వేశ నీలీల లిం
పుగ వర్ణింపరు నిన్భజింపరిదియేమోవింత? రామప్రభూ!

మ॥ ధనముల్ వోయినఁబోవనిమ్ముడుమలున్ దన్నుంపరానిమ్ము,వ
ద్దని మిత్రుల్ వడిఁజెప్పనిమ్ము పలుబాధల్ గ్రమ్మనిమ్మైన,నీ
తనువెల్లప్డు పరోపకారమునకే ధారాప్రదత్తంబుగా
వినియోగించెదనన్న త్యాగియొకఁడే వీరుండు రామప్రభూ !

మ॥ నరులన్ మోసముఁజేసి యిండ్లకును కన్నాల్ద్రవ్వి జూదంబు
లన్
దొరవై.దారులుగొట్టి యెట్లయిన దొంతుల్ పేర్చువిత్తాఢ్యుఁడౌ
నరునింద్రుండని, చందురుఁడంచు గుణియున్ నమ్యుండు గ
మ్యుండు న
చ్చరితాత్ముండనుచున్ నుతింతురిల భాస్వద్వంశ!రామప్రభూ!

మ॥ పరకాంతన్‌గని కాముకుండయి. గగుర్పాటొంది యేరీతి నీ
తరుణిన్ బొందఁగనౌనటంచుఁబెనుచింతన్ బొందునేగాని సో
దరిగా నామెను జూడనెంచఁడటులే తల్పోదిరిన్ గూర్చియుం
బరుఁడన్యంబుఁదలంప నోర్వఁగలఁడే క్ష్మాధీశ! రామప్రభూ!

మ॥ వరదా! వక్రతరాకృతిం బొలుచు కుబ్జంజూచి ప్రేమాన :
కరలంబాపి మనోహరాంగిగను జక్కంజేసి లోకాన నా
దరమున్ బొందవె? యీ విధానపలుపుంతల్ వోపు నాబుద్ధి :
కరలన్ బాపి నినున్ దలంచు సరణిన్ గావింపు రామప్రభ

మ॥ సరవిన్ గౌతమపత్నిపై, శబరిపై, సౌమిత్రిపై, వత్రి
దరణి ప్రోద్భవుపై, సమీరసుతుపై, ధాత్రీతనూజాత
దను సంచారులపై, విభీషణునిపై ధారాగతిన్ బాఱు నీ
పరమ ప్రేమము పొంగనిమ్ము మఱి నాపై నింత రామప్రభ

మ॥ అనఘా! గొంగళిలో భుజించుచునుకట్టా! వెంట్రుకల్ గాన
య్యెనటంచున్ వచియింపలాభమిసుమంతేఁ గల్గునే, నన్నుః
మనుపంబూని మదీయదోషముల నెన్నంబాడియే? పాప
డనము జ్ఞేయము పొలముంచెదవా నీటన్ ముంతొ రామప్రభ

మ॥ వ్యసనాసక్తము, చంచలంబు, విషయవ్యాప్తంబునౌ, నాదు:
నసమా, క్రోఁతికిఁ గల్లు ద్రాఁపినటు నానా చేష్టలన్ జేయు,
ని సమాధిస్థముఁ జేయ నాకుఁ దరమౌనే! నీవె శిక్షించి నీ
దు సమక్షమ్మున నిల్పుకొమ్ము హనుమంతున్ బోలె, రామప్ర

మ॥ కరుణన్ బీదలఁ దన్పలేని నరుభాగ్యంబెల్ల వ్యర్థంబె, తా
నిరుపేదైనను నున్నదే యొసఁగునేనిన్ వాఁడె ధన్యుండు,
గరమందున్ జలమెంతయుండినను జక్కం దప్పికన్ దీర్చునే
సరసుల్ తియ్యని నీరునిచ్చును, పిపాసన్ దీర్చు రామప్రభ

మ॥ "అడుగన్మానిన నమ్మయేనిడఁగఁబోదన్నట్లు" మావాంఛితం
బడుగన్మానిన నీవుదీర్చెదవె? వీయానందమే నీది, నీ
యడుగుందామరసేవ చేయఁగల భాగ్యంబిచ్చి కాపాడఁగాఁ
గడుమోదంబున వేఁడుచుంటిని కృపాకంధీశ! రామప్రభూ!

మ॥ శ్రవణానందముగాఁగ నీమధురవాచావైభవంబాని, క
న్గవ కింపారఁగఁ డావకీన లలితాకారంబు దర్శించి, ది
వ్య విభూతుల్ వెలయించు నీదుచరణ ద్వంద్వమ్ము నర్పించి నీ
స్తవముల్ సేయఁగఁగల్గు భాగ్యమిడు విశ్వారాధ్య! రామప్రభూ

మ॥ వరదా! యెంతని వేఁడుకొందు "పలుకే బంగారమా" నీకు స
త్కరుణా సాగరుఁడన్న మేటి బిరుదున్ దాల్పన్ ఫలంబేమి, నా
మొఱయాలింప వొకింతయేనియు, స్వయంభూ, యేల యీ
బింకమా
కరిపైఁ జూపిన పేరిమలోఁ జివరిభాగంబిమ్ము రామప్రభూ !

మ॥ అదినాకిమ్మది యిమ్మటంచు నినునేనర్థింపఁగాఁబోవ, నె
య్యది నాకున్ హితమైనదో యదియె నిత్యంబీవ యీడేర్తు, నె
మ్మది నిండారజపింతు నీమహితనామంబెప్డు సద్భక్తి నీ
పదపద్మంబులు నాకుఁజూపుము, కృపాపారీణ! రామప్రభూ!

మ॥ దినముల్ మంచివియైనఁగష్టమిసుమంతేఁ గానరాకుండు, నా
దినముల్ చెడ్డవియైన సౌఖ్యమిసుమంతేరాదు, రాకున్నచో
జనులేలా వినుదూరఁగావలె నిదే జాడ్యంబు, తత్త్వార్థమున్
గనఁగా కష్టసుఖాలు కావడిని కుండల్ గావె, రామప్రభూ !

మ॥ దినముల్ రాత్రులు నిన్న మొన్న వలెనే దీపించెడిన్ గ్రొత్త యెం
దునుగానంబడ, దాయువా తరుగుచుండున్ రోజుకున్ రోజు, భో
జనపానాదులు ప్రాఁతవే? క్షణిక సంసారంబులో సౌఖ్యమె
న్న, నభస్సూన మటంచు నెంచెద ననంతజ్ఞాన రామప్రభూ !

మ॥ అవురా! వార్ధివతుష్క మధ్యగత విశ్వాధీశులా ధారుణీ
ధవులేయేఁగిరి, వారలేమయినఁజేతంబట్టి గొంపోయిరే
యవనిన్ మానవుఁడిన్ని చూచుచును మాయంబొందతానాత్మని
య్యాని నిత్యంబులఁటంచునెంచు నతిమోహభ్రాంతి రామప్రభూ

మ॥ కరుణన్ గంటికి ఱెప్పపోలిక ననుంగాపాడుచున్నావు, సం
బరమొప్పారఁగ నాదు ప్రార్థన సదామన్నించుచున్నావు, నీ
కొఱకై యేమొనరించుచుంటి మెపుడో గోరంతధ్యానంబుఁద
ప్ప, రమానాధ భవత్కృపారసము కూపారంబు రామప్రభూ

శా॥ దేవా! తావకపాదపద్మములు భక్తింగొల్చు భాగ్యంబు, నీ
దౌవాత్సల్యముఁజూపి నాకిడఁగనే నర్థింతునెల్లప్డు, నీ
సేవాకృత్యము ముక్తిమార్గముగదా! జీర్ణించు నీదేహముల్
జీవశ్రేణికి శాశ్వతంబులగునా! చింతింప రామప్రభూ !

మ॥ భవదుఃఖంబులువాపి భక్తులకు కైవల్యంబు చేకూర్చి సం
స్తవముంజెందెడి లోకమాతయగు సీతాదేవియున్గూడ, దా
నవమాయా పరిభూతయై వెతలఁబొందన్ లేదె? కర్మంబు దా
ట వశంబా భువినెంతవారికి, వికుంఠావాస! రామప్రభూ !

మ॥ పదునాల్గేఁడు లరణ్యవాసమునకున్ బంపించెఁగై కేయి చె
డ్డది సుమ్మీయని యూరులోకమిది కట్టా! కష్టదుష్టాత్మలన్
జదియన్ జేయఁగఁబంపె నంచనరుగా? సత్యంబు నేవారెఱుం
గుదురయ్యా! మఱిపాడులోకమిటుపల్కున్ గీడు రామప్రభూ!

మ॥ అనఘా! నీకరుణారసం బిపుడనాయాసంబుగా నాకు గ
ల్గెను, నేఁడాదిగ నెల్లకాలమును నీలీలన్ నుతింపంగ సే
వనముల్ సేయఁగ బుణ్యభాగ్యములు సంపాదింతు, నీదివ్యమూ
ర్తిని నాచిత్తమునన్ సదానిలుపు భక్తింగొల్వ రామప్రభూ!

మ॥ అయ్యా! యెందులకీ కవిత్వములు కూడా గుడ్డయా దీన నే
దయ్యేన్ లబ్ధి వృధాప్రయాసమిదియేలా యంచుహో పప్పురా
మయ్యల్ కొందరు పల్కుచుందురు, తదన్యప్రక్రియాస్ఫూర్తికే
దయ్యా మూలమునీవుగాక సుకవిత్వాలంబ! రామప్రభూ!

మ॥ అతుల బ్రాహ్మణదైవభక్తి! గురుసేవాచారసంయుక్తి, స
న్మత రక్షావిహితానురక్తి! హితసత్యస్వాదు సాధూక్తి! దు
ర్మత శిక్షాకరణప్రసక్తి! చతురామ్నాయాంతరర్థోక్తి! సం
తత నారాయణపాదభక్తి! నిడ నిన్ గాంక్షింతు రామప్రభూ

మ॥ పరమేష్టిన్ గను బ్రామిసోమకుఁడు ప్రాఁబల్కుల్ వడిన్ దోఁచిసా
గర మధ్యంబునడాఁగ లోకములు చీకాకొంద మీనంబవై
త్వరగా సాగరమందుఁజొచ్చి దనుజున్ దండించి వేదంబులన్
దిరుగున్ బ్రీతిని బ్రహ్మకిచ్చితివి పృథ్వీనాథ! రామప్రభూ!

మ॥ వనధిన్ ద్రచ్చెడువేళ మందర మహాభారంబు నైరింప నో
పనివారై శరణంచుఁదావక పదాబ్జాతమ్ముఁజింతించు, నా
దనుజారాతులకోర్కెఁదీర్చ వెరపొందన్ గూర్మరూపంబుతో
వనధిన్జొచ్చియు వీఁపునందుగిరి దాల్పన్లేదె? రామప్రభూ!

మ॥ కనకాక్షుండు స్వబాహుదర్పజిత నాకాధ్యక్షుఁడై, ధారుణీ
వనజాతాక్షీ రసాతలంబునకుఁజేర్పన్ సూకరాకారమున్
గొని విక్రాంతిని నాతనిన్ దునిమి చిక్కుల్వాయభూదేవి,ద
క్షిణ దంష్ట్రాగ్రముతోడ నెత్తితివి జేజేమెచ్చ రామప్రభూ!

మ॥ సరసీ జాసనదత్త దుర్ఘటపరాజయ్యత్వ గర్వాంధుఁడై
హరి విద్వేషముఁబూని యాత్మసుతుఁబ్రహ్లాదాఖ్యుబాధించుచో
నరసింహాకృతివై హిరణ్యకశిపున్ వక్షస్థలిన్ జీల్చి, భూ
భరమున్ దీర్చిన దిట్టవీవగద విశ్వస్తుత్య! రామప్రభూ!

మ॥ త్రిదశేంద్రున్ బలిచక్రవర్తి భుజశక్తింగెల్చి తత్పురి దు
ర్మదుఁడై చేకొన గుజ్జువై యతనిఁజేరంజొచ్చి మూఁడడుగులే
గద నేకోరితినంచుఁగొల్చితి త్రిలోకమ్ముల్. సురద్విట్పురం
బది పాతాళము నంటద్రొక్కితి, వనంతాకార రామప్రభూ!

మ॥ నిజధర్మంబులు వీడనాడి ఖలులై నిందార్హులైనట్టి భూ
భుజులన్ద్రుంపఁగ భార్గవాన్వయమునన్ బుట్టొందిరాముండవై
భుజదర్పోద్ధతి రాజులన్ దునిమి తద్రక్తమ్ములన్ గట్టవే
నిజపూర్వుల్ త్రిదివంబు నెక్కుటకునై నిశ్రేణి రామప్రభూ!

శా॥ గుండెల్ కల్గినవారలున్న ననుమార్కొండంచు గర్వించు దు
ష్టుండా రావణుఁజంపఁగోసల సుతాసూనుండవై పుట్టి నీ
చండస్థేమముఁజూపి సాభిజసురక్షస్వామి ప్రమందించి, బ్ర
హ్మాండక్షేమము సంఘటించిన మహీయశ్శౌర్య! రామప్రభూ!

మ॥ యదువంశంబున రామకృష్ణతను నీవావిర్భవంబంది, దు
ర్మదులౌ కంసముఖాసుర ప్రతతికిన్ ప్రాణాంతమున్ గూర్చి, క
ష్టదశన్ బొందెడు పాండుపుత్త్రులకు రాజ్యంబిచ్చి కాపాడు త్వ
త్పద పద్మమ్ములు సర్వదా నిలుపు మద్భావాన రామప్రభూ!

మ॥ బుద్ధుల్ దుర్మత సంగతమ్ములయి దుర్మోహాభిభూతంబులై
సద్ధర్మంబు దొలంగవర్తిలు ప్రజాసంఘంబవిద్యా తమో
విద్ధాచారులుగాఁగ ధారుణి సమావిర్భూతమైపోల్చు నీ
బుద్ధాకారము నాత్మనెంచెద, స్వయంభూ! యీశ! రామప్రభూ!

మ॥ కలికాలంబునఁబాపముల్ వెరుగ సత్కార్యంబులన్ మాని, భ్ర
ష్టులునై చేయగరాని కార్యములుఁదోడ్తోఁజేయుచున్నట్టి పా
పుల పాపంబులఁబాపఁద్యాగినయి యీభూమిన్ వడిన్ కల్కివై
వెలయంగాఁగలవాఁడ వీవుగద యోవిశ్వేశ! రామప్రభూ!

శా॥ నానారూపములెత్తి దానవమదోన్మాదంబు డున్మాడి, ర
క్షానైపుణ్యముమీర లోకములు దీక్షన్ బెంచి పోషించి యు
జ్ఞానంబుల్ వదిలింతు భక్తులకు దంపద్భావ యోగీశ్వర
ధ్యానాంతర్గతమూర్తి వీవుగద సత్యస్తుత్య! రామప్రభూ!

మ॥ నవమాసంబులు మోసికాంచి, పయి నానాబాధలం బొంది, చ
న్గవ ద్రావించియుఁ బెంచి యెంతయు ఘనున్ గావించు తల్లిన్ విధే
య విధిన్ గొల్వక భార్యవచ్చువయి మోహంబంది బాధించు, దు
ర్భవులన్ నీతియుతాత్ములన్ సలుపుమో భవ్యాత్మ రామప్రభూ

శా॥ "మల్లీ! మాధవి! కేతకీ! కురవకీ! మందారమా! మాలతీ!
ఫుల్లాబ్జాక్షివి సీతఁ గన్గొనినఁ దెల్పుం" డం చరణ్యంబు నం
దెల్లన్ గ్రుమ్మరి పల్వరించితఁట స్వామీ! సర్వమోహవ్యథా
వల్లుల్ ద్రెంచెడి నీకుఁ గూడనిది సంభావ్యంబె రామప్రభూ!

శా॥ "రాజుం గాంచినకంటఁ జూచి తనభర్తన్ మొత్తఁ గాఁబోవు" నా
యోజన్ సంస్కృతికాంతఁ గూడి ధనభోగోద్యోగ కామాది వాం
ఛా జాలంబునఁ జిక్కువాఁడు మదిమెచ్చన్ జాలునే నీపదాం
భోజారాధన ధన్యజీవిత మహాభోగంబు రామప్రభూ!

శా॥ నీయాజ్ఞన్ జవదాఁటఁ జాలఁ డెవఁడేనిన్ వానకై యింద్రునా
జ్ఞాయత్తంబొనరింపు, మల్లె బహుసస్యప్రాప్తికై భూమినా
జ్ఞాయత్తంబొనరింపు, మీ నిఖిల విశ్వంబన్న మో రామచం
ద్రా! యించున్ విలపింపఁ జూడ నటులేలా యున్నొ రామప్రభూ!

మ॥ ధనమున్ గల్గినదాని దాఁచుటకుఁ జింతంబొందు రాత్రింబవ
ళ్ళును విత్తాఢ్యుఁడు, పేదవాఁడు వెతనుల్కున్ జేతకానేవి లే
దని రెంటన్ వెతలే మొతప్పవు యదృచ్ఛావాప్తి సంతృప్తి బొం
దనిచో శాంతియు సౌఖ్యమే పగిది బొందన్వచ్చు రామప్రభూ!

మ॥ అనుకూలాత్మ గలట్టి భార్యకలవాఁ డక్కానలో నున్నఁడి
యున్ని సంతోషముఁ బొందు, భార్య ప్రతికూలాచారయే యైనచో
ధనధాన్యమ్ములు భోగభాగ్యము లనంతంబయ్యు నీలోక మం
దున నెప్డున్ యమలోకయాతనల నందున్‌గాదె? రామప్రభూ!

మ॥ కవియెంతే శ్రమకోర్చి యుత్సుకతమైఁ గావ్యంబు నీపై మనో
జ్ఞ వచోగుంఫనలన్ రచింపఁగ వితానవ్యాశయుల్ గొందఱుం
డెవియో లేవని పాత్రతఁ పఫక్కియని యెంతేఁ గేలిగా వింతురీ
యవివేకం బవినీతి మాన్పి యిడుమయ్యా! భక్తి రామప్రభూ!

మ॥ తనరాజ్యంబు నొసంగెనొక్కఁడు, నితాంతత్యాగియొక్కండు మే
నుఁగండల్ తెగఁగోసి యిచ్చె, మతొకండున్ నిండుప్రాణాలతో
డనె దానంబిడెఁ దన్ను నీ భరతఖండంబందు మున్నిట్టినే
లనెనేఁడౌర! పరార్థవంచనము లీలాకేశి రామప్రభూ!

మ॥ పరమాన్నంబులు మెక్కియుయ్యెలల పైఁ బన్నుండి, శ్రీలిచ్చుక
ప్పురపున్ వీడ్యములందికొంచుఁ గవనంబుల్ తొల్లి గుప్పించియుం
డిరఁటే యాంధ్రకవుల్ ప్రభూ! కొలఁతతిండిన్ గల్గునా బోటివాఁ
డరరే! తానెటు నీవు మెచ్చునటు వ్రాయన్నేర్చు రామప్రభూ!

మ॥ తరుణుల్ తుంగతరంగ మాలికలు! సంతానమ్ము దంష్ట్రాభయం
కర సత్త్వవ్రజ మర్థముల్ జలములై కన్పట్టు నద్దాననే
పరమామ్నాయ శిఖారహస్యవిదులౌ బ్రహ్మణ్యమూర్ధన్యులె
ల్లరు సంసారముసాగరంబు నిరి లీలామర్త్య! రామప్రభూ!

శా॥ ప్రోదింగాంచిన యగ్రహారములనామముల్ దీసికొన్నారె! మీ
మీఁదన్ వేరొకదారిచూచుకొనుఁడీ మీయోగ్యతా పత్రముల్
బూదిం ద్రోయుఁడు మీమొఱల్ వినఁగ దేవుండుండె, పొండన్నదే
కాదా దక్కెఁ బ్రజాప్రభుత్వకృతి సౌఖ్యస్ఫూర్తి రామప్రభూ!

మ॥ శివుఁడన్నన్ సివమెత్తు వైష్ణవునకున్ శ్రీనాధుపేర్విన్నఁబై
త్య వికారంబుదయించు శైవునకు, బ్రహ్మాద్వైతులవ్వారురూ
ప విభేదంబు ఉపాసనాసుకరతాపన్నంబు, లీభక్తు లి
ట్లు విభూ! దేవునిపంచుకోఁబెనఁగురట్టుల్ మేలే? రామప్రభూ!

మ॥ అనఘా! నీమృదునామ సంస్మరణచేయన్ దీఱికేలేదు, పొ్రి
ద్దుననే రేషనుతేవలెన్ బిదప నుద్యోగానకున్ బోవలెన్
బనిలో సంస్కృతి కష్టసాధ్యముకదా! బాధాకరంబైన యీ
దిన గండమ్ముదొలంచి నిన్దలఁచు శక్తిన్గూర్పురామప్రభూ

మ॥ పరఖండాంతరవాసులౌజనులు సంపద్భోగముల్ వొంద, నా
వరుసన్దామనఁగోరి నీతినియమభ్రష్టాత్ములై, దాసులై
చిరకాలార్జితమౌ స్వరాజ్యము నుపేక్షింపంగ హిందూధరన్
గఱవుల్ నిత్యములయ్యె దీనినుడుపంగారాదొ? రామప్రభూ!

మ॥ మనదేశమ్ము, స్వభాషయీద్వితయమున్ మన్నించి, యాపై నికాం
క్షనిఁకేమైనఁదదన్యదేశగత భాషల్ నేర్వగావచ్చు! నే
ర్చిన మాత్రాన, నధఃకరింతు రవె ఛీఛీ! స్వీయమౌ భాష, నే
లను బోనాడుచు సాముచేయుటలు మేలా! తెల్పు రామప్రభూ!

మ॥ మతవిద్వేషముఁబూని, భూతదయయేమాత్రంబు నున్లేక, మూ
ర్ఖత నా వేశముఁజెందియొండొరులఁగ్రౌర్యస్ఫూర్తి ఖండించుకొం
చితురల్గేలి యొనర్పఁగా నడుతురే హిందూమూసల్మానులీ
జితకున్ సఖ్యము నైకమత్యమిడినిచ్చుల్ కావు రామప్రభూ!

మ॥ అధికారానకు దానులై విపుల గర్వాంధ్యమ్మునన్ రేఁగి హే
యధనాశావశ చిత్తవృత్తులయి యుక్తాయుక్తముల్ లేక, ధీ
నిధులన్ జిక్కులపాలు సేయుచు సదానిందింతుర్ బాధింతు:రీ
యధికారమ్మెవరిచ్చిరో యడుగలేవా నీవు రామప్రభూ !

మ॥ కలహజ్వాలలు రేఁగుచున్నవి దిశాకాశమ్ములన్ నేఁడు, ధూ
ర్తులు హైడ్రోజను బాంబులంట, మఱియేదోయంటసృష్టించిప్రా
ణులతో సర్వజగమ్ముఁగాల్పుటకుఁ దెన్నుల్ సూచుచున్నారు.వీ
రలపైఁ జక్రము పట్టలేని జగముల్ అంపిల్లు రామప్రభూ !

శా॥ పాముంజావదు కఱ్ఱయున్ విరుగదీపాడైన లోకంబులో
మేమున్నారము చచ్చిచావక, యిదేమేలా! ప్రజాకోటి యి
ట్లీమై నేడ్చుచునుండ నంతపురిలో నెట్లీవు నిద్రింతువో
స్వామీ! రక్షణఁజేయఁగాఁదగు నవశ్యంబిప్డు, రామప్రభూ !

శా॥ ఎందున్ జూచిన లంచముల్ పనులు కానేకావులేకున్న, గో
ర్దందాఫీసుల, స్కూళ్ళ, రైళ్ళ మఱియేయంగళ్ళనాస్పత్రులన్
దిందిందిమ్మను లంచెగాండ్రె, తుది నీతీర్థ ప్రసాదాలు, మా
కందన్ లంచములంట నీకెఱుఁగరాదా! దేవ! రామప్రభూ!

మ॥ గ్రిహముచ్చస్థితినున్నఁబట్టినది బంగారమ్ముగా మారు, నా
గ్రహచారస్థితి బాగులేనియెడ బంగారమ్మె యంగారమౌ
గ్రిహచారమ్మునబట్టియే గలుగు దుఃఖంబున్ సుఖంబైన, నా
గ్రిహచారమ్మిటు లున్నదింకఫలమీఁగానీవ! రామప్రభూ !

మ॥ ధనసంపాదనకై దురంతమగు బాధల్‌వొంది యార్జించి యా
ధనమేప్రాణము, ప్రాణమే ధనముగాఁ దర్కించుచున్ బిల్లికై
నను బిచ్చంబిడకుండ, తారు తినకుండన్ దాఁచుటే మంచిదా?
చనుచోఁ గొండొక గుడ్డిగవ్వ గొనిపో సాధ్యంబె? రామప్రభూ!

మ॥ సంసారాంబుధి దాఁట నీదు చరణాబ్జాతద్వయీ పోతమున్
సంసేవించుటగాక సేవ్యమని యన్యంబున్నదే దేహికిన్
హంసీయానల బాహుబంధ పరిరంభానంద మానందమే
మాంసాసృఙ్మయమౌ శరీరము తిరంబా ధాత్రి రామప్రభూ!

మ॥ సనకాద్యుత్తమ మౌనిపూజిత పదాబ్జాతప్రభావంబు, దు
ర్జన కుట్టాక భుజాబలంబు, బుధరక్షాదీక్షమౌనేర్పు, స
త్య నిదానంబగు నీయుదాత్తమతి, రమ్యంబైన నీరూపు! నేఁ
దనివిన్ దీఱఁగఁజూచు భాగ్యమిడరాదా! ప్రేమ రామప్రభూ!

మ॥ అజరుద్రామరనాథులైన నుతిజేయన్ లేరు నిన్నన్న, నే
నుజడుండన్, మనుజుండ, నేకరణి నిన్నుంస్తోత్రముంజేయనే
ర్తు, జగద్రక్షక! నీ కృపారసము నంతో యింతయో రాల్చి, నీ
ప్రజయందేనొక చిన్నిబిడ్డఁడ ననున్బాలింపు రామప్రభూ!

మ॥ కరుణాసాగర! భక్తవత్సల! రిపుక్ష్మాపాలహృద్భల్ల! త్వ
చ్చరణాంభోజ రజంబుసోక శిలకున్ జ్ఞానోదయంబౌచు, బి
త్తరియై నిల్చెఁగదా! త్వదీయ పదచింతన్‌జేయు నాకున్ నిరం
తరమున్ జ్ఞానమొసంగిప్రోవ బరువౌనా నీకు రామప్రభూ!

మ॥ జలముల్ గ్రోలు గజేంద్రుఁడాత్మపదమున్ సత్త్వాధికస్ఫూర్తిసు
జ్జ్వలదంష్ట్రోచ్ఛట గ్రుచ్చిపట్టు మొసలిన్ సాధింపఁగాలేక, ని
శ్చల భక్తిన్ నినువేఁడఁగా మకరమున్ జక్రంబునన్ద్రుంచి, వ
త్సలతన్ బ్రోచితి వాగజేంద్రునదిరా! త్వత్ప్రేమ! రామప్రభూ!

శా॥ పాపధ్వాంత దివాకరా! రిపుజనప్రాగల్భ్య సంహార నా
నాపత్కంటక ఘోరకాననకుఠారా! భక్తమందార! దు
గ్ధాపాంరాశి గభీర! మౌనిజన చిత్తాంభోజ సంచార! అ
లాపాగమ్యవిహార! హారకటకాలంకార! రామప్రభూ!

శా॥ పాపాత్ముండగుగాక, కల్లరికులభ్రష్టుండగుంగాక, దు
ర్వ్యాపారుండగుగాక, యెల్లపుడు విప్రద్వేషియౌగాక, యే
రూపంబైన సరే త్వదీయజపమేరూపించి తాఁజేయఁద
త్పాపాళిన్ బడగొట్టి ముక్తినిడవే తత్త్వజ్ఞ! రామప్రభూ!

మ॥ ఇదినాయిల్లు, మదీయకోశమిదె నాయిల్లాలు నాబిడ్డల
ల్లదిగో, నాదగుబంధువర్గమని యుల్లంబందు మోహంబు నొం
ది, దురాలాపములాడు మానవుఁడు ముక్తింబొందఁగాఁగల్గునే
తుదిలేనట్టి భవాబ్ధిలోనఁబడి యీఁదున్గాక రామప్రభూ!

మ॥ తలపన్రానిది నీ స్వరూపమతి చోద్యంబౌను నీశక్తిని
ష్ఫలముల్ గానివి నీదులీలలు; జగద్వ్యాపార పారీణముల్
కలదో లేదో భవన్నివాస మెచటన్ గన్పట్టదో యేమొ, నీ
తలఁపుల్ చేతలు చిత్రమౌనుగద సత్యాధీన రామప్రభూ!

మ॥ ఒకసంసారముదిద్దఁగాఁగలుగు నేర్పొక్కింతయున్ లేకయూ
ఱక వాపోవుచునున్న వారమిఁట, నీరాగుండవై యెట్టులీ
సకలస్థావర జంగమాత్మక మహాసంసార భారంబిటుల్
ప్రకటప్రౌఢిని దిద్దుచుంటివి కృపాపారీణ! రామప్రభూ !

మ॥ నీపై భారముసుంచి యీశతకమున్ నేవ్రాసి యర్పించితిన్
నీపాదాబ్జములందు; దీనికతులోన్నిద్ర ప్రభావంబిలన్
స్థాపింపబడదేవి వ్యాప్తినిది చెందన్ లేదయే; నద్ది నీ
లోపంబో మఱినాదుపాపమొకొ యాలోచింపు రామప్రభూ !

మ॥ ఇది ప్రాచీనసువృత్త గౌరవమునెంతేఁగల్గియున్ ఛాంద సా
స్పదగానేరదు నవ్యతాగరిమి గర్వస్ఫూర్తియుంబూనఁబో
పదు మత్కావ్యకుమారి యెన్నఁడును జల్పాకత్వమౌగ్ధ్యమ్ములం
దదు దీనిన్వరియించి భోగముల మోదంబందు రామప్రభూ !

శా॥ దేవా! యీశతకమ్ము నందు నినునుద్దేశించి నాప్రాజ్య వి
ద్యా వైదుష్యముఁజూపికీర్తిఁగన నేనాశింపఁగాలేదు, మ
ద్భావంబంతయుఁదావకీన నుతిపద్యాల్ వ్రాయునప్డేనిఁజిం
తా వైకల్యముఁబాసి నిల్చుననియే నాయూహ రామప్రభూ !

శా॥ స్వస్తింబల్కఁగదోయి భారతమహీసాధ్వీమనః ప్రీతిగాఁ
బస్తుల్ వీడి ప్రజల్ సుఖింపఁబొలముల్ పండింపుమోయీ! నినున్
బ్రస్తావింపఁగఁజేయుమోయి, ఖలులన్ బంధించి లోకానకో
వస్తాదూ! శుభమీగదోయి సుజనుల్ వర్ధిల్ల రామప్రభూ !

మ॥ వరమేడేపలి వంశవర్ధనుఁడు విద్వల్లోకమూర్ధన్యుఁడున్
జరితార్థోత్తమ జన్ముఁడైన రమణాచార్యాఁఖ్యు శిష్యుండ, ని
ద్ధర మూలాన్వయ పేరనాభిధుఁడ సంధానించి దోసిళ్లఁద్వ
చ్చరణాబ్జంబులఁజేర్చితీశతక ముద్యద్భక్తి రామప్రభూ !

# శ్రీ కృష్ణ శతకము

శ్రీమంతంబులు, సర్వమౌని జనసంసేవ్యంబు, లార్తావనో
ద్దామంబుల్, చదలేటిపుట్టుపునకాధారమ్ము, లామ్నాయవా
క్ప్రామాణ్యంబులు, మోక్షమార్గ విభవప్రాప్తిప్రకర్షమ్ములో
స్వామీ! తావకపాదపద్మములు; కృష్ణా! భక్తబృందావనా!

మ॥ నినుఁ జింతించిన, విన్న,ఁబేరుకొనినన్ నిర్మూలమైపోవుఁబా
పనికాయంబులటంచు శాస్త్రచయముల్ వల్కుంగదా:నిత్యమో
వనజాతాక్ష! విధీశముఖ్య సురసేవ్యంబైన నీ నామచిం
తనమాహాత్మ్యముఁ దెల్పనాతరమె? కృష్ణా!భక్తబృందావనా!

మ॥ నినుబ్రహ్మాదు లెఱుంగలేరుగద తండ్రీ! సర్వలోకావనా!
వినయత్యాగ గరిష్ఠుఁడన్, విపులగర్విశ్రేష్ఠుఁడన్, లోభమో
హనికాయాదివరిష్ఠుఁడన్, దురితదూష్యవ్రాత భూయిష్ఠుఁడన్
గన నిన్నెట్టులు నాకుసాధ్యమగుఁ గృష్ణా! భక్తబృందావనా!

మ॥ చెవులందున్ సుధధారగాఁజిలుకు వంశీనాదముల్ వీనులన్
దవులన్ మోదరసంబులో మునుఁగలేదా బృందలో నెల్లనున్
భవదీయాద్భుతగానమాధురులఁ దెల్పన్ శక్యమా? నీదు గా
నవిశిష్టాంబుధి నోలలార్చుననుఁ గృష్ణా! భక్తబృందావనా!

శా॥ అక్రూరున్, దివిజేంద్రనందనుని, గోపానీకమున్, ద్రౌపదిన్
నక్రోధుండగుకాళియాహి, నలకుబ్జన్, జాహ్నవీసూనునిన్
వక్రత్వంబునులేనిసాత్యకిని గావన్ బూనుప్రేమన్ జగ
చ్చక్రక్షేమముఁగూర్పఁగాఁబరపు కృష్ణా! భక్తబృందావనా!

మ॥ వనజాతాక్షుఁడు, సింహమధ్యముఁడు సంపద్దివ్యగాత్రుండు, నీ
లనవాంభోదశరీరుఁ డార్యనుతలీలాలోలుఁ డాప్తుండు, స
ద్వనమాలాంగదహారకంకణసముద్యత్కుండలుండంచు, ని
న్ననరే? నాకిఁకఁజూపుమా తనువుఁగృష్ణా! భక్తబృందావనా!

శా॥ స్వామీ! పూజలచేత నిన్దనుపఁగా సామర్థ్యమాలేదు, వా
చామాధుర్యముఁజూపి నిన్నునలరించన్ గానమా రాదు, త్వ
న్నామాలావనమూని నిన్నుఁబరితృప్తస్వాంతునిన్ జేయ నీ
సామీప్యంబున కెట్లురాగలను? కృష్ణా! భక్తబృందావనా!

శా॥ చంకల్ కొట్టుచుఁ గేకిసల్ సలుపుచున్ సామర్థ్యమం చెంచుచున్
జంకుల్ కొంకుసువీడి మోహమద మాత్సర్యమ్ములంజిక్కిని
శ్శంకన్ లంచములన్ గ్రహించు ఖలులన్, జాతీయవిద్రోహులన్
శంకాతంకముమాని చంపుమిఁకఁగృష్ణా! భక్తబృందావనా!

మ॥ ధనముం గల్గినమత్తతం బడసి నిన్ ధ్యానింపఁ బోరన్న యూ
హనొ, నీపాదసరోజయుగ్మము నెదన్ ధ్యానించుభక్తాళి ని
ర్ధనులంజేసి విత్తాఢ్యులన్ ఘనిచివంతల్ గూర్చి నీనామచిం
తననిత్యంబు నొనర్పఁజేసెదవు కృష్ణా! భక్తబృందావనా!

మ॥ విమలజ్ఞానముతోడ భక్తియుతులై, విశ్వాసమున్ బూని, ని
త్యముహృన్మందిరమందు నిన్ దలఁచుమాత్రన్ జన్మ మీడేరు, సౌ
ఖ్యములేపాప శుభాధికమ్ములరు, మోక్షశ్రీలుచేకూరుఁ, బు
ణ్యములూ ఖున్, గలుషంబులాఖుఁగద, కృష్ణా! భక్తబృందావన

మ॥ ప్రతిపద్యంబు రసస్ఫుటంబుగ రచింపంగల్గు వాక్ఛక్తి, హృ
ద్గతభావంబుఁ బ్రశస్తరీతి నుడువంగానేర్చు రమ్యోక్తి, వి
జ్ఞతఁజేకూర్చు మనోజ్ఞసూక్తి వెలిబుచ్చన్‌గల్గుధీశక్తి, సం
తతమున్ నీపదపద్మభక్తి నిడుః కృష్ణా! భక్తబృందావనా!

శా॥ దారిద్రమ్మునదల్చి, నంతతము చిత్తస్థైర్యమున్‌గూర్చి, ని
స్సారంబైన మదీయజీవలతకుం సౌహార్దమందించి; లో
కారాధ్యంబగు నీపదాబ్జములయందానక్తిఁ జేకూర్చి; వి
స్తారప్రజ్ఞను నన్నునేలుమికఁ; గృష్ణా! భక్తబృందావనా!

శా॥ ఏరూపంబున నిన్నుఁగొల్తు? హృదినేనేమూర్తిధ్యానింతు? ని
న్నేరూపంబునఁజూతు? నాదుమదిలోనేరూపుఁ జిత్రింతు? నో
స్మేరాస్యా! తెలియంగఁజాల జడుఁడన్ నేమంబుగానన్ను సం
సారాంభోధిఁ దరింపఁజేయగదె; కృష్ణా! భక్తబృందావనా!

మ॥ అరిషడ్వర్గసుహోగ్ర విస్తృత తరంబౌ ఘోర భంగార్భటీ
భరితాంభోనిధి నాదుమానసమదేభం బుగ్రకుంభీరదు
ర్భరదంష్ట్రాప్రహతిఁజిక్కి స్రుక్కియనదైవాపోవుచుండెన్, భవ
చ్చరణంబుల్ శరణంబునిమ్ముదయఁ గృష్ణా! భక్తబృందావనా!

మ॥ అసహాయుండను, నీదుసేవకుఁడ, విత్యాగంధశూన్యుండ, వి
శ్వసనీయంబగు నీదుపాదభజనా సంసక్తచిత్తుండ, రా
క్షసవిధ్వంసక! నాదుదోషతతులన్ ఖండించి; మన్నించి, సం
తసముంగూర్చుము, నీదుసేవనిడికృష్ణా! భక్తబృందావనా!

మ॥ అవమానంబులనేటఁ ద్రోసి బుధవాక్యశ్రేణిగ్రహించి, గౌ
రవమర్యాదలుమంటఁగల్పి; ఋజుమార్గంబెల్లవర్జించి, మో
హవశంబందునజిక్కి అంచముల పెల్లాశించి పీడించు, మా
నవరక్షస్సులఁ బాతిపెట్టుమిఁకఁ; గృష్ణా! భక్తబృందావనా!

మ॥ శరణంచున్. గరుణించుమంచు, వరదా! సర్వేశ్వరా! యంచుదు
ర్భరసంసారపయోధినింకఁ దరియింపన్గల్గు భక్తిన్ నిరం
తరమున్ నాకునొసంగుమంచు, బహుదా తండ్రీ నినున్గోరి నీ
చరణాబ్జమ్ముల నాశ్రయించితిని; గృష్ణా! భక్తబృందావనా!

మ॥ అతులంబైనతపః ప్రభావ విభవాత్యంతాధికుల్ లోకమా
న్యతఁగన్నట్టి మహామునుల్ దెలియలే రావంతయున్నిన్ను; న
జ్ఞతతోఁగూడినమానవుండ, నెటు నీసాన్నిధ్యమున్ జేరఁగా
జితనంబెట్టిది చేయుమందు, వికఁ, గృష్ణా! భక్తబృందావనా!

శా॥ నీతుల్ రోఁతలు, బూతులేహితము లీనిర్భాగ్యసంఘమ్ములోఁ
బాతివ్రత్యము బూటకంబు, శ్రుతిసంభారంబులున్ డంబముల్
జాతుల్ కల్పితమంచుఁ బల్కుజనులెల్లన్ మాన్యులైనాఁడు, వి
ఖ్యాతిన్ భారతమెట్లుబాగుపడు? కృష్ణా! భక్తబృందావనా!

మ॥ ఖలసంసారమహాజ్వరమ్ములకు ముఖ్యంబైన మందెల్లవే
ళల నీపాదపయోజపూజయె; యనల్పంబైన ప్రారబ్ధకీ
లలలోఁజిక్కి తపించు మర్త్యతతికెల్లన్ నీదునామంబు హ
ర్షలసన్నీరదమౌచుఁ బ్రోచుగద? కృష్ణా! భక్తబృందావనా!

మ॥ జనసంస్తుత్యులు, ధర్మబద్ధులగు సంస్థానాధిపుల్ లేరు, వే
డ్కను, దైవార్చనసల్పు ఆస్తికులు కూడన్ లేరు, సత్కావ్యము
ద్రణకై బూనెడు దాతలాకయవు; నిత్యద్వేషనిర్మగ్నులై
జనులీనాడు మెలంగుచుండిరదె! కృష్ణా! భక్తబృందావనా!

మ॥ హృదయంబందునఁ గ్రుళ్ళుసుంచుకొని, పైకింపౌ క్రియన్ బల్కిదు
ర్మదులై సంతతసజ్జనాపకృతిచర్యల్ బూనుదుర్మార్గులే
మొదలైనారుధరిత్రి, కాలగతియేమోదేవ! యవ్వారలన్
బదుగుర్మెచ్చెడి త్రోవకున్ మలపు; కృష్ణా! భక్తబృందవనా!

శా॥ చాలుప్ జాలునుదుష్టమానవుల తుచ్ఛంబైన మిత్రత్వముల్
జాలున్ జా లధికారిదుర్మదుల నీచంబైన సంసేవలున్,
జాలున్ జాలు, నసారభూతమగు సంసారంపు వాంఛావళుల్,
జాలున్ నాకిఁకఁ దుచ్ఛభోగములు; కృష్ణా! భక్తబృందావనా!

మ॥ కరిపై, శంతనుసూనుపై, విదురుపై గాండీవిపై, కుబ్జపై
గురుపై, పాండవపత్నిపై, నజునిపై, గోపాంగనాశ్రేణిపై
వరదల్ కట్టిన నీదయారసము నాపైఁ గొంతపాటింపు, నీ
చరణారాధన తత్పరుండఁగద! కృష్ణా! భక్తబృందవనా!

మ॥ పరిహాసంబుననైన, భీతినయినన్, ప్రఖ్యాతినైనన్; హృదం
తరఘోరార్తినినైన, డంబముననైనన్, గాని యేరైన నీ
స్మరణన్ జల్పినఁజాలు, వారియఘవిస్ఫారమ్ముఁబోఁగొట్టి, మో
క్షరమావాసమొసంగుచుండవొకొ? కృష్ణా! భక్తబృందావనా!

శా॥ సర్వేశుండవు, సర్వకార్యకరణాశ్చర్యప్రభావాదికా
ఖర్వస్ఫూర్తివి, సర్వలోకపరిరక్షాదక్షుఁడౌవాఁడవో
సర్వజ్ఞా! నినుఁదెల్పుచుండవొకో యాస్థన్ వేదముల్ ప్రీతిమై
"సర్వం విష్ణుమయంజగ"త్తనుచుఁ గృష్ణా! భక్తబృందావనా!

మ॥ శ్రమమేకాని సుఖంబులేని యురుసంసారాంబుధిన్ గూలి, తీ
రముఁ జేరందగుశక్తి లేమినివిచారం బూను నామీఁద స
త్క్రమకారుణ్యకటాక్షముల్ బరపి, యీప్రారబ్ధ సంసార బం
ధముఁదప్పించి ముముక్షుఁజేయుమిఁకఁగృష్ణా!భక్తబృందావనా!

మ॥ కరి నిన్నెట్టులువేఁడె, ద్రౌపదియెటుల్ గావించెనీపూజ, యా
నరుఁడేరీతిని నిన్నుఁగొల్చె, యదుబృందంబెట్లు నీమెప్పుఁగాం
చిరి, యక్రూరముఖాదిభక్తులెటులన్ సేవించిరోతెల్పు; మా
సరణిన్ నేమను నిన్నుఁగొల్చెదను గృష్ణా!భక్తబృందావనా!

శా॥ శ్రీలన్ గూర్చి కుచేలు; నక్షయములౌచేలంబు లందించ్చి పాం
చాలిన్; జచ్చినపుత్రునిచ్చి గురునిన్; సారథ్యమున్ జేసి నీ
వీలోకంబునఁ గ్రీడినేలవొకో?; దేహి! యంచు యాచించెదన్
నాలోపంబుబుదిద్ది ప్రోవుమిఁకఁ; గృష్ణా! భక్తబృందావనా!

శా॥ శ్రీయుక్తుండవు, ప్రేమమూర్తివి, కృపాచిత్తుండవంచున్ బుధుల్
నీయౌదార్యముఁ దెల్ప నేనువిని, నిన్నే నమ్మి, నీమీఁదనే
నాయావద్భరముంచికావుమనుచున్ నమ్రుండనై కొల్చెదన్
సాయంబిచ్చి భరంబుమాన్పుమిఁక గృష్ణా! భక్తబృందావనా

మ॥ మునిరాట్చిత్తములందు, సత్యనియతిన్, బుణ్యాగమశ్రేణియం
దున, నాకావళిచిత్తపద్మములయందున్, సత్కవివ్రాత ప
ద్యనికాయంబులయందుఁనిండుకొలువై దైవారు నీమూర్తి; నే
ననఘా! నిత్యము నాత్మనిల్పెదను; గృష్ణా! భక్తబృందావనా!

మ॥ శరణం బయ్యెను నారదాదిమునిరాజశ్రేణికిన్, మేలియా
భరణం బయ్యెను కాళియాహి తలకున్, బ్రారబ్ధపాథోధి సం
తరణం బయ్యెను భక్తసంతతికి, నామ్నాయైకహృద్వీధి సం
చరణం బయ్యెను నీపాదాబ్జములు; కృష్ణా! భక్తబృందావనా!

మ॥ ధనధాన్యంబులు, మేటిపాపదవులన్, దారాత్మజాళుల్, సుహృ
జ్జనసంఘమ్ములు, గొడ్డుగోదలును, నైశ్వర్యమ్ములున్ మేడలున్
గననీసర్వమునశ్వరంబె, స్థిరమొక్కండైన నందున్నదే,
జనకా! నీదగుభక్తియేస్థిరము; కృష్ణా! భక్తబృందావనా!

శా॥ బాలక్రీడలఁగొన్నినాళు, లటుపై భామాకుచాలింగనా
వ్యాలోలమ్మునఁ గొన్నినాళు,లవలన్ వ్యామోహసంసారలీ
లాలౌల్యంబునఁ గొన్నినాళు, లిటులేలా త్రిప్పెదీఘోర బం
ధాలన్ద్రెంపి తరింపఁజేయుమిఁకఁ, గృష్ణా!భక్తబృందావనా!

మ॥ ఎపుడెద్దేనియు నీపదాబ్జయుగళీహృద్యానవద్యార్చనా
విపులాసక్తిఁగడంగునట్టి తఱిలో విఘ్నంబుఁగల్పింతువ
య్య! పరీక్షం బొనరింపనెంచెదవొ యేమయ్యా! భవద్ధాటికిన్
జపలుండన్ నిలువంగనేర్తునొకొ? కృష్ణా! భక్తబృందావనా!

శా॥ ప్రారబ్ధంబుహరింపఁగాఁదగు మహాప్రజ్ఞాప్రకర్షమ్ము నీ
కేరాజిల్లుచునున్నదంచు మునిరాడ్బృందమ్ము వాక్రువ్వదే,
కారుణ్యాసినిఁబూని నాయఘలతల్ ఖండించి కాపాడుమో
శౌరీ! దీనజనైకబంధుఁడవు కృష్ణా! భక్తబృందావనా!

శా॥ కర్ణానందముగాఁగ నీవరగుణగ్రామంబు నాలించి, సం
పూర్ణానందముగాఁగ నీమధురమౌ మూర్తిన్ విలోకించి, దు
గ్ధార్ణోరాశిసుతార్చితమ్మలగు నీయంఘ్రిద్వయీ సేవలన్
స్వర్ణశ్రీకవితాత్మ! నాకిడుము కృష్ణా! భక్తబృందావనా!

మ॥ చలనంబించుకలేని నిబ్బరముతో, సంతుష్టచిత్తంబుతో,
జలజాతాసనవాసవాదిసురపూజాభాజనం బౌచు, ని
ర్మలభాగీరథి జన్మభూమియగు నీపాదాబ్జయుగ్మంబు ని
చ్చలు ధ్యానించు దృఢైకదీక్షనిడు కృష్ణా! భక్తబృందావనా!

మ॥ క్రతువుల్, దానములున్, జపంబులును, సత్కర్మాగ్నిహోత్రాఖిల
వ్రతముల్, తీర్థములంచుఁ గుంకుటలు నీభావంబురంజింప లే
వతి మోదాశ్రుకణంబులుప్పతిలి సర్వాంగీణరోమాంచము
న్నతి దీపింపఁగభక్తి ముందరయఁ గృష్ణా! భక్తబృందావనా!

మ॥ పరమేశా "శిరసుండనేమిటికిసల్పన్ బూజమో కాలికిన్"
బరమప్రేమను భక్తకల్పకమవై భవ్యానురాగంబుతో
వరుసన్ భక్తులమొఱ్ఱలల్ వినుచుఁ దద్బాధన్ నివారించుచున్
గరుణింపంగల నీవెయుండగను? గృష్ణా! భక్తబృందావనా!

మ॥ వరముల్గొంచు సురారులత్యధికగర్వప్రేరితక్రౌర్యబం
ధురులై, సర్వజగమ్ములన్ వెతలయందున్ముంచి బాధింపఁగా
గరుణన్ దుష్టులఁజంప, శిష్టజనరక్షన్జేయ నీపుర్విపై
నరవిన్బుట్టవె, పెక్కురూపములఁ గృష్ణా! భక్తబృందావనా!



శా॥ నానాదీనజనైకరక్షణ కృతానందా! ఘనాకార! వి
జ్ఞానామోఘధురీణ! దుష్టజనశిక్షాదక్ష! శిష్టావనా!
నానాగోపకగోపికాహృదయబృందా! దాసచిత్తాంచిత
స్థానా! కాళియశిక్షణప్రవణ! కృష్ణా! భక్తబృందావనా!

మ॥ ప్రమదస్ఫూర్తిని నీదుకీర్తనమొనర్పంబోనిదా జిహ్వ; ప్రే
మముతో నీపదవందనమ్మొనరింపన్ రాని మూర్ధంబు, హ
ర్షముతోఁ దావకశాస్త్రచోదితసపర్యల్ మానుహస్తంబు, కష
ష్టములన్ గొల్పునెకాని మేలిడునె? కృష్ణా! భక్తబృందావనా!

మ॥ శ్రమగల్గించుచు నింద్రియమ్ములను చోరవ్రాతముల్ జ్ఞానవి
త్తమునెల్లన్ హరియించిబల్మిని నగాధంబైనమోహాంధ కూ
పమునన్ద్రోసెను, దిక్కులేని నను లేవన్ దీయుమయ్యా! యవ
శ్యముఁగేలూత నొసంగి వత్సలతఁ గృష్ణా! భక్తబృందావనా!

మ॥ వరదా! యంచును, కేశవా! యనుచు, సద్భక్తప్రియా! యందు, శ్రీ
హరి! యంచున్, కమలాపతీ! యనుచు, దుగ్ధాంభోధిసన్మందిరా!
కరుణాధామ! యటంచు భక్తిపులకాంగశ్రేణితో, మోదబా
ష్పరసమ్మూరఁగఁబల్కుచుండెపుడొ? కృష్ణా! భక్తబృందావనా!

మ॥ నిను, వైకుంఠ! ముకుంద! మాధవ! రమానేతా! యుపేంద్రా! జనా
ర్దన! గోవింద! మురాసురాంతక! హరీ! దామోదరా! నందనం
దన! బృందావనధామ! యంచు మది నానందంబు సంధిల్లసం
జనితోత్సాహముతో నుతించెదను గృష్ణా! భక్తబృందావనా!

మ॥ నినుఁ జింతించినవారిపాపచయముల్ నిర్మూలమైపోవు; పా
వనచిత్తంబునఁగొల్చుభక్తులమనోవాంఛాళులీడేర్తు, వే
డ్కను నిన్గొల్చెడివారికెల్ల నెదుటన్ గన్పట్టునీరూపు నీ
యనురాగాంబుధి కొడ్డులేదుగద!కృష్ణా! భక్తబృందావనా!

మ॥ అడుకుల్గుప్పెడిడన్గుచేలునకు సర్వైశ్వర్యముల్గూర్చి,యు
మ్మడిగా నక్షయవస్త్రదానమిడి యప్పాంచాలిరక్షించి, లోఁ
దడఁబోకార్చి కిరీటికయ్యమరగీతన్జెప్పి యజ్ఞానమున్
సడలన్జేసిన ప్రేమరూఁడవు కృష్ణా! భక్తబృందావనా!

మ॥ గృహబాధల్, ఋణబాధ, లిప్పగిదిదారిద్ర్యంపుబాధల్ కడున్
బహుళంబై ననుఁజుట్టుముట్టినవిదేవా! వానికిన్లోఁగి య
స్వహమున్ గుందుచునున్న నాపయిదయన్వర్షించిసంసారదు
స్సహబాధావళిఁ బాపవేఁడెదను, కృష్ణా! భక్తబృందావనా!

మ॥ అనవద్యక్రియలందు, సత్కృతుల, నామ్నాయాంతసిద్ధాంతవా
గ్వనితాకుంతల వీధులందు, మునిముఖ్యశ్రేణిచిత్తంబులం
దున, బృందావనవీధులందు, గుణసందోహంబులోనెప్డుఁ గ్రొ
న్ననలన్బోలిన నీపదాల్ తలఁతుఁగృష్ణా! భక్తబృందావనా!

మ॥ హృదిమాలిన్యముమాపి, చిత్తమునకెంతేభక్తిఁజేకూర్చి. యా
పదలెల్లన్బరిమార్చి, పాపములతాపంబెల్లఁబోకార్చి, నీ
పదసాన్నిధ్యముఁ జేరఁగాఁదగినత్రోవన్ జూపివాత్సల్యవ
ర్షదపాంగేక్షణ నేలుమింకననుఁ కృష్ణా! భక్తబృందావనా!

శా॥ దేశారాధన, మాతృపూజ, గురుభక్తిస్ఫూర్తియున్, సత్కళా
కౌశల్యంబును, పాపభీతి, జితదుష్కామాప్తి, యాస్తిక్యమున్
ధీశాలిత్వము, మేలివర్తనము, సద్విద్యావివేకాదులున్
సౌశీల్యంబు నొసంగుమీప్రజకుఁ గృష్ణా! భక్తబృందావనా!

శా॥ ఆచారంబులు, వేషభాషలును, మర్యాదప్రకారంబులున్
ఛేచాతుర్యముమాటె;- స్వార్థరతియెంతే హెచ్చె నే వేళ కే
యేచిత్రంబులు పుట్టునోయెఱుఁగలేరెవ్వారు, నీసత్కృపా
సాచివ్యమునొసంగి ప్రోవఁదగుఁ గృష్ణా! భక్తబృందావనా!

శా॥ దేవా! కేలనుగొండనెత్తుటను, ప్రీతిన్ గుబ్జకున్ సుందర
శ్రీవాల్లభ్యముఁగూర్చుటన్, గురుసుతున్ జీవింపఁగాఁజేయుటన్
ప్రావీణ్యమ్మునఁ బెక్కువల్వలిడి యాపాంచాలిరక్షించుటన్
గైవల్యప్రదుఁడౌట స్పష్టపడెఁ గృష్ణా! భక్తబృందావనా!

మ॥ యమునాతీరవిహార! నాహృదినరఃప్రాంతంబు నందంచవై
రమణన్ నిత్యవిహారమున్ జలుపుమీ రాజిల్లుసత్రేమ దు
ర్గమసంసారపయోధినుండి ననుతీరంబందునన్ జేర్చుమీ
శ్రమయంచున్ మదినెంచఁబోకుమిఁక; గృష్ణా! భక్తబృందావనా

శా॥ సంధ్యావందనమా సమస్కృతులహో స్నానంబ! జోహారు; ని
ర్వంధ్యంబౌ జపదానహోమములకున్, స్వస్తిందగన్ జెప్పి మో
హాంధ్యంబెల్లనుపిడి నీపదమహోపాస్తిన్ దగంజేయు దీ
క్షం ధ్యానింపుచునున్న నన్ మనుపు కృష్ణా! భక్తబృందావనా!

మ॥ కడుభక్తిన్ గరయుగ్మమున్ నుదురుసోఁకన్ జేర్చి సద్భక్తినీ
యడుగుందమ్ముల మీఁదవ్రాలికనులం దానందబాష్పమ్ములున్
జడిగా జాఱఁగ గద్గదస్వరముతో సద్భక్తి నీ సేవలె
న్నఁడు జేయంగలభాగ్యమబ్బెడునొ? కృష్ణా! భక్తబృందావనా

మ॥ ఒకమాటెవ్వఁడు నీదునామమును దానొప్పారఁగా బల్కునో
సకలాఘంబులు నుగ్గునూచమయి మోక్షశ్రీలవాఁడొందు; మో
దకరున్, మంగళదివ్యనాము, నినునిత్యప్రార్థనల్ సేసినన్
సకలార్థంబులు కొంగుబంగరువె; కృష్ణా! భక్తబృందావనా!

మ॥ సతతంబున్ భవదీయపాదసరసీజధ్యానసంసేవనా
రతులౌ భక్తులు వేఱుదేవతలఁజేరన్ లోన నూహింతురే?
తతభక్తిన్ సురవాహినీమధురపాథః పానతృప్తుండు తా
జతనన్ జేయునె యుప్పునీరుఁగొనఁ గృష్ణా! భక్తబృందావనా!

మ॥ శరణంటిన్, గరుణింపుమంటి, ననురక్షన్ జేయవేడ్కొంటి నీ
కరుణాపూర్ణసుధాపయోధిలహరీ కల్లోలకేళీకళా
పరిణామంబుల నన్నుఁదేల్పుమని నిన్ బ్రార్థించుచుంటిన్; భవ
చ్చరణంబున్ శరణంబుజేయుఁగదె కృష్ణా! భక్తబృందవనా!

మ॥ మనుజానీకము సేవలన్ జలుపు జన్మంబిచ్చినావయ్య! యెం
తవి సేవించుదు; తృప్తినొందరొకనుంతన్ గూడఁబై పెచ్చుహే
శనగావింతురు, వారిసేవలిఁకనేలా నాకుఁ? దద్బాధలిం
క నివారింపుము నీదుసేవలిడి; కృష్ణా! భక్తబృందావనా!

మ॥ నియతిన్ దప్పక నిన్నుఁగొల్చిన మహానిష్ఠాగరిష్ఠాత్ముల
క్షయపుణ్యాత్మకులైన పాండవులకున్ గష్టాలుకల్గించి ని
ర్దయుఁడై తిట్టిన చైద్యరాజునకు స్వర్గంబీయవే॥ యిట్టి ని
శ్చయమున్ బూనుట యేమినీతియగుఁ? గృష్ణా! భక్తబృందావనా

మ॥ పురుహూతాఖిల రాజ్యభోగకలనా పూర్ణస్థితుల్, సత్కళో
ద్ధురభావోన్నతులన్నియున్ దురమునందుంగెల్చి గ్రేళ్ళుబ్బునా
నరకున్ సంగరరంగ నిర్గళితప్రాణత్రాణునిం జేసి రా
జ్యరమన్ వజ్రికొసంగవే కరుణఁ? గృష్ణా! భక్తబృందావనా!

శా॥ వ్యూహంబుల్ వివిధంబులై మెఱయయొండొంటిన్ వినిర్జించుమ
త్సాహశ్రీవెలిఁ జిమ్ము రెండుబలముల్ సన్నద్ధమౌ చోట స
ద్వ్యాహారమ్ములతోఁ గిరీటికిని గీతార్థంబు బోధించి స
న్నాహున్ జేయవె సంగరంబునకుఁ? గృష్ణా! భక్తబృందావనా!

శా॥ అంభోజాసన పాకశాసన కృశాన్వాద్యాదితేయుల్ శుభా
రంభస్వాంతులు తావకీన మృదుపద్రాజీవ సందర్శనా
దంభాతిస్థిరభక్తినిచ్చెదరుగాదా? దేవ! నేనింక వి
స్రంభంబొప్పఁగ నిన్నుఁగొల్చెదనుగృష్ణా! భక్తబృందావనా!

మ॥ వరదా! నీవెటులుందువో, పయిని రూపంబెట్టిదో, గంటికిన్
గఱవుందీఱఁగ నిన్నుఁజూడఁగల భాగ్యంబెన్నఁడో, భక్తిత
త్పరతన్ నీదరినిల్చి నీదుపద్మద్వంద్వ పూజాక్రియా
చరణాతత్పరతృప్తి జెందెదనొ, కృష్ణా! భక్తబృందవనా !

శా॥ పూర్వంబే భవమందొ వాణిపదముల్ పూజించినాఁడన్ శ్రవః
పర్వంబౌ మృదుకైత దానవొదవెన్, బద్యాళి నర్పింతు నా
నిర్వేదంబుహరించి, చిత్సుకము నందింపంగదే యంచునొ
గను సర్వార్థవిభూతి సంతతముఁ గృష్ణా! భక్తబృందావనా!

మ॥ మనుజుండైహికబంధభూతమగు సంసారంబులోనున్న పా
వనయుష్మత్పద్మయుగ్మ భజనోపాత్తావ్యయానంద సం
జనితాశ్రూదక గండభాగయుతుఁడై సద్భక్తి నిన్ గొల్చువన్
గను సర్వార్థవిభూతి సంతతముఁగృష్ణా! భక్తబృందావనా !

మ॥ కమలాక్షా!గుణదక్ష! భక్తజనరక్షాపేక్షమౌ నీపదా
బ్జముమూలంబునుచేరనాఁడ, వనుఁగాపాడంగ రారమ్మ ని
త్యము నీసన్నుతిదక్క నేమెఱుఁగనయ్యా!నీదుమాయావిలా
సముఁబోఁద్రోచి దయార్ద్రదృష్టిఁగను;కృష్ణా!భక్తబృందావనా

శా॥ శ్రీకృష్ణా! వ్రజరక్షణా! గుణనిధీ! వృష్ణీంద్ర! గోపాలకా!
లోకాలోకజనైకరక్షణచణా! లోలాత్మ! సర్వాత్మకా!
పాకారిప్రముఖామరార్చితపదా! వాచంయమాదిత్య ర
క్షాకేళీప్రియ! రాధికారమణ! కృష్ణా! భక్తబృందావనా!

శా॥ ప్రేమస్థానము భక్తకోటికిఁ, దపస్విశ్రేణి కత్యుత్తమ
క్షేమాగారము; దేవతావళికి నిక్షేపంబు; దుష్టాసుర
స్తోమధ్వంసముఁజేయుమృత్యువు;దయాదుల్ చిమ్ముస్వర్ధేను;వో
స్వామీ!తావకపాదపద్మములు కృష్ణా! భక్తబృందావనా !

శా॥ 'నారున్ బోసినవాఁడు నీరములొగిన్ దాఁబోయఁడే'యంచు ధీ
సారుల్ పెద్దలుపల్కుచుందురుగదా! సర్వేశ నన్ బ్రోవఁగా
భారంబెల్లవహింపు మాశ్రితజనవ్యాపారకేళీకళా
చారా! సత్కరుణామృతాంబునిధి! కృష్ణా! భక్తబృందావనా !

శా॥ కళ్యాణంబులొసంగు నీదునుతులన్ గావింపఁగాఁ జిత్తనై
ర్మల్యంబున్ బటుదీక్షయున్ విపులధైర్యస్థైర్యముల్ గూర్చిచాం
చల్యంబందెడు నాయెడందకును నీసత్పాద సంస్తుత్యకౌ
శల్యంబున్ సమకూర్పవేఁడెదను, కృష్ణా! భక్తబృందావనా!

మ॥ చెడుకాలంబిది దాఁపురించెను జుమీ! "శ్రీరంగనీతుల్" వచిం
చెడువారెక్కువ, తాముచెప్పునది తార్సేయంగఁగ్రై కొకయె
ప్పుడు మీరల్తగమేముచెప్పునది సల్పుండంతియేకాని మా
నడతల్ దూరకుఁడంచుఁబల్కుదురు కృష్ణా!భక్తబృందావనా!

శా॥ విశ్వామిత్రుని పూతగోత్రమున నావిర్భావమున్ జెందితిన్
విశ్వామిత్రుని శిష్యుఁడీవగుటచే వేద్యంబు బాంధవ్యమో
విశ్వశ్రేయక! కాన నీగురుకులావిర్భూతునిన్ నన్నిఁకన్
శశ్వచ్ఛ్రేమనుఁ జిల్కఁబ్రోవగదె; కృష్ణా! భక్తబృందావనా!

శా॥ బంధుప్రేమముఁ బూనియర్జునుని ప్రాపై ఘోరయుద్ధమ్ములో
గాంధారేయులఁ బుత్రమిత్రపటు సంఘాతమ్ముతోఁగూల్చి, ని
ర్బంధమ్ముల్ తొలఁగించి ధర్మజునికిన్ రాజిల్లు ప్రేమన్ జతు
ష్కంధిప్రావృతరాజ్యమిచ్చితివి కృష్ణా! భక్తబృందావనా!

మ॥ రసవద్భోగములెండమావు లిలపై ప్రాయంబు క్రీనీడ, లీ
యసువుల్ బుద్బుదసన్నిభంబులిఁక,దారావత్యముల్ సంకెలల్
ప్రసవస్రగ్జుల సంపదావశులు భాస్వచ్చంచలానీకముల్
ససిసంసారమునందు నాస్తిగద; కృష్ణా! భక్తబృందావనా!

మ॥ ఇడుమల్ గల్గఁగనీక పేరిమిని నన్నెంతేనిఁ గాపాడఁగా
గడఁగన్ జాలినవాఁడ వీవనుచు నేఁగాంక్షించి నద్భక్తి నీ
యడుగుందమ్ములఁ బట్టుకొంటిఁగద యయ్యా! 'పాలనోసీటనో'
చడియుంజప్పుడులేక ముంచుమిఁకఁ గృష్ణా! భక్తబృందావనా!

శా॥ కంగారెత్తెడి రాజకీయముల పోకల్ జూడఁగా నయ్యయో!
బంగార్పండెడుభారతంబునను తీవ్రక్షామముల్ రేఁగె ని
ల్వంగానోపనిధాభలన్ మునుఁగు జీవవ్రాతమున్ సద్దయా
సంగా! కావుమటంచు వేడెదను గృష్ణా! భక్తబృందావనా!

మ॥ అలదీపంబును నార్పుపుర్వుతనదేహం బట్టివేగాల్చు ది
వ్వెలదాఁ జుట్టు చరించుసట్టిగతి నిర్వీర్యంపు సంసారపా
శలతాబద్ధుఁడనౌచు, భ్రాంతినదియే సౌఖ్యంబుగానెంచి నే
నలకుంజెందితి నిన్నుఁజేరితిని గృష్ణా! భక్తబృందావనా!

ముక్తపదగ్రస్తము

శా॥ పారావారగభీర! భీరు జనతాపాపాటవీఖండనో
దారా! దారుణదైత్యశిక్షణకలాదక్షప్రచండప్రభా
చారా! చారుతరైకగోపవనితాస్వాంతాబ్జినీరమ్యకా
సారా! సారగుణాభిరామ యదుకృష్ణా! భక్త బృందవనా!

శా॥ శాంతుండంచును, శాశ్వతుండవనుచున్, సర్వేశుఁడంచున్, గళా
సంతానామలమూర్తివంచును, మహాసంసారసంతారణా
సంతాపక్షయకారివంచు మునులశ్రాంతంబు నిన్నెంతురో
సంతుష్టిప్రదగీతికాప్రచుర! కృష్ణా! భక్తబృందావనా!

మ॥ దివిటీచే రవికిన్ నివాళులిడురీతిన్; జంద్రకాంతోపలో
ద్భవవారిన్ శశికర్ఘ్యపాద్యమిడురేవన్; గాజుచేతన్ ధరా
ధవునిన్ వేబరితుష్టిచేయుగతి; యేతత్స్తోత్రమున్ ద్వత్పదా
బ్జ వశంబున్ బొనరింపవ్రాసితిని గృష్ణా! భక్తబృందావనా!

శా॥ దేవా! కాళియపన్నగాధరుణ నీదివ్యప్రభావోన్నతుల్
భావింపన్ గమలాసనాభవదిశాపాలాదిదేవేశు లెం
తే వర్ణింపనశక్తులౌదురనఁగా నేనెంత నిర్వ్యాజర
క్షావై దుష్యముఁజూపిప్రోవుమిఁక గృష్ణా! భక్తబృందావనా!

మ॥ మఱపుంజెందఁగలేదు నీనుతులలో మాహాత్మ్యమున్, నీభట
త్వరుచిన్ సుంతయుఁబీడలేదు, భవదుక్తంబైనగీతన్ నిరా
కరణంబున్ బొనరింప; నీపయిఁగృతుల్ గల్పింపఁగామాన, నీ
చరణారాధనమున్ విడన్నుడిని గృష్ణా! భక్తబృందావనా!

మ॥ బరువా! నీకొకప్రాణిఁగాచుట కృపాపాథోనిధీ! శ్రీనిధీ!
కఱవా! నీకుభవత్కృపామృతముచిల్కన్ శ్రీపతీ! సద్గతీ!
హరువా! నీకిటు నిన్ను వేఁడుటలు భక్తారాధనా! పావనా!
సరువా! నీకిఁకదాసువేచుటలు, కృష్ణా! భక్తబృందవనా !

శా॥ శస్త్రత్వత్పద పంకజద్వయము హృత్పద్మమ్ములో నుంచి నే
నిస్తుల్యంబగు భక్తిభావమున నిన్నేనమ్మియుండంగ నన్
గస్తిన్ బెట్టుటన్యాయమా!యుచితమా!కార్పణ్యమా?నేమమా?
స్వస్తిన్ జెప్పుము నాదుబాధలకుఁ గృష్ణా! భక్తబృందావనా!

శా॥ కాయన్ గాచెనుకండ్లుపౌసులకు నిన్గాంచంగఁ గాంక్షింప, నెం
తోయాయాసముఁ జెందుమీఁదట గజేంద్రున్ గాచినావీవు, పెన్
మాయన్ ముంచుచు గొల్లయింతులకు గంతల్ కట్టినావయ్యా! నీ
సాయం బియ్యదియా! దయానిలయ! కృష్ణా!భక్తబృందావనా

మ॥ పరమోద్భక్తి నిగొల్చు భక్తులను దిప్పల్ వెట్టి నిన్ దిట్టు ము
ష్కరులౌ కంసముఖాదిదైత్యులకు స్వర్గమ్మున్ బ్రసాదించి నా
వరరే! నీహృదయంబురీతిఁగనలే నావంతయున్ నేనహో
సరిలేరెండవధక్కిఁద్రొక్కెదను గృష్ణా! భక్తబృందావనా!

మ॥ తలిదండ్రుల్ జెఱసాల స్రుక్కి బహుబాధల్ పొంద: మోదంబు బ్రే
తలకందిచ్చితి "వైనవారలకుఁగాదా యాకులన్, గాని వా
రలకున్ గంచములందుఁ బెట్టు"టను నేర్పాయిద్ది? నీవిట్టి చే
ష్టలు మున్నెక్కడ నేర్చుకొంటివొకొ? కృష్ణా! భక్తబృందావనా

మ॥ అనికిన్ బాండవకౌరవుల్ బలుని సాహాయ్యంబు నర్థింప నా
యనగారప్పుడు తీర్థయాత్రమిషచే సంగీకృతిం జూపకే
చనె. నిన్ బ్రార్థనసేయ నేశరముదాల్చన్, వత్తుఁజున్నుంటిఁ బె
ల్చన "మీరిద్దరు తోడిదొంగలిఁకఁ గృష్ణా! భక్తబృందావనా

మ॥ ఒగిమంత్రిత్వము నొందనెంచి ప్రజకెన్నో మేటివాగ్దానముల్
మిగులన్ జేయుచు వారిప్రాపునను బేర్మిన్ మంత్రులై, వారుహా
యిగజీవించుచు వీరలన్మఱవరా "యేర్దాటియున్ దెప్పనున్
దగులం బెట్టెడునట్టిరీతి"గద? కృష్ణా! భక్తబృందావనా!

మ॥ కడలిం దూరఝుషంబవై, సురలకై గంభీరకూర్మంబవై,
బడుగుం బాపఁడవై; నృపుండవయివహ్వా! నీవు "యేమెండకా
గొల్లగుం బట్టుచు సంచరించెదవు" నీకున్ సాటి యెవ్వారునీ
నడతల్ భక్తిహితైకవర్తనలు కృష్ణా! భక్తబృందావనా!

మ॥ ధనసంపాదనగాని యన్యవిషయధ్యానంబులేనట్టి దు
ర్జనమైత్రిన్ బొనరించినాఁడ మృగతృష్ణన్ నీరమన్ భ్రాంతిచే
తను బర్వెత్తితి బల్ శ్రమల్ పడితి వ్యర్థంబయ్యె నాతృష్ణ; స
జ్జనతారాధక! చిత్తశాంతినిడు; కృష్ణా! భక్తబృందావనా!

మ॥ నవనీతమ్మునకన్న, మీఁగడలకన్నన్ దీయనౌ శర్కరా
ద్రవములకన్నను, ద్రాక్షకన్న నటుమీఁదన్ గోపకాంతాధరా
సవపానంబునకన్నఁ, దీపివెలిబుచ్చున్ జాలు మేల్కైత నీ
దవు పాదాబ్జములందునుంచితిని గృష్ణా! భక్తబృందావనా!

మ॥ మతియత్యంతము చంచలంబగుట నేమాత్రం బుపేక్షించినన్
సతతంబున్ విషయాభిలాషమెయి సంచారంబు గావించు న
క్కఁతనన్ దానిని నీపదాననిడి నీగాథల్ రచింతున్ దయో
న్నత నాచిత్తము చక్కఁదిద్దుమిఁక గృష్ణా! భక్తబృందావనా!

మ॥ చిరకాలంబుననుండి నీపదములే చిత్తంబులోనిల్పి నీ
స్మరణంబే శరణంబుగాఁదలఁచి నిచ్చల్ నమ్మి నామీఁదఁ ద్వ
త్కరుణాపూరమునింపవా? బహుళబాధల్ ద్రుంపవా? చింపవా
సరసప్రక్రియనాదుపాపములు? కృష్ణా! భక్తబృందావనా!

శా॥ ఏనామంబుఁ దలంచి నారదుఁడు మౌనీశప్రభుండయ్యె, నిం
కేనామంబు నుతించి గోపవనితాబృందంబు పెంపొందెనో
ఏనామస్మరణంబుచే నఘములెంతేఁ దూలునో, యట్టి నీ
దౌనామంబు సమాశ్రయించితిని గృష్ణా! భక్తబృందావనా!

శా॥ నీకర్మంబునవచ్చినట్టి యిడుమల్ నేనెట్లుపోఁగొట్టి నిన్
సాఁకన్ గల్గుదునందువా! సరియె, కష్టవ్రాతముల్ సైఁపఁగా
నాకున్ దాల్మి యొసంగుమాయని నితాంతంబైన సద్భక్తితో
నాకేల్దోయి మొగిడ్చి వేఁడెదను గృష్ణా! భక్తబృందావనా!

మ॥ ధరకున్ గల్గినయోర్పు, నగ్నిఁగల పూతత్వంబు వృక్షమ్ములన్
స్థిరమైయొప్పుపరోపకారకృతి యర్చిష్మంతు నందున్న య
బ్బురమౌనక్రమదీక్ష నీరములలోఁ బొల్పొందు నైర్మల్యమున్
సరగన్ భారతజాతికీగదవె కృష్ణా! భక్తబృందావనా!

మ॥ శతకంబున్ భవదీయపాదసరసీజధ్యాన దివ్యార్చనా
కుతుకస్వాంతుఁడ నౌచుఁగూర్చితిని వాగ్గుంభం బలంకారమ
ద్భుతభావోన్నతమాధురీగుణము లిందుం గల్గునో గల్గవో
చతురున్ నిన్ బతిఁజేసి నీకిడితిఁ గృష్ణా! భక్తబృందావనా!

శా॥ లాటీనేత్రపుటీ పయోధరఘటీ లాస్యేందుజానిష్కుటీ
పాటీరద్రుమవర్ణనన్ నలుపఁగా భావింతురేకాని వా
గ్ధాటిన్ గృష్ణముకుంద సర్వజగదాధారా! యటంచాడు; తే
నాటన్ మెచ్చునకుంగనంబడవు కృష్ణా! భక్తబృందావనా!

మ॥ అనఘా! నీదగుపాదపద్మభజనానందైక చిత్తుండ నే
దనివిన్ గూర్చితి పద్యపుష్పములచేతన్ మాల; మూలాన్వయుం
డను, బేరన్నకవిన్ గడున్ ముదముతోడన్ నీకు నర్పింతు స
జ్జనసమ్మానముఁ గూర్చుమీకృతినిఁ గృష్ణా! భక్తబృందావనా!

# శ్రీ వేంకటేశ్వర శతకము

శ్రీరమణీయమై నిగమ సేవితమై, కలుషచ్ఛటాటవీ
మారణ కారణంబునయి మౌనిహృదంతరవాపమంత్రిమై
సారససంభవాది సురసంతతి సన్నుతమై యెసంగు నీ
చారుపదాంబుజద్వయము సారెకు మ్రొక్కెద వేంకటేశ్వరా!

ఉ॥ ఆ నిగమాళి వందిగణమై మునిపుంగవబృందమెల్ల నా
స్థానకవీంద్రులై, జలధిసంఘము భాసురకోశశాలలై,
కానలు నందనమ్ములయి, కాశ్యపసంతతి యాత్మజన్ములై
పై నిలఁ గొల్వుకూటముగఁ బాలనసేయవె? వేంకటేశ్వరా!

ఉ॥ తేనెలు జాలువారు వలితేట తెలుంగునఁ గావ్యసృష్టి సం
ధానమునన్ విరాజిలెడు నన్నయ తిక్కన యెఱ్ఱనాది క
వ్యాననసీమ జొబ్బిలు సురాపగలోన నిరంతరమ్ము మో
దాన మునుంగువారలెకదా! కృతకృత్యులు? వేంకటేశ్వరా !

ఉ॥ ఊపిరి యాడనీయని భవోదధియందు మునింగి, ఘోరసం
తాపమునందుఁ జిక్కుకొని త్రాసము నొందుచు నేను భక్తర
క్షాపరతంత్రుఁడన్ బిరుదు కంకణమున్ గయిఁదాల్చినట్టి నీ
దాఁపునఁ జేరినాఁడఁ బరితాపముఁ బాపవె వేంకటేశ్వరా !

చ॥ నిజముగ నీపదాబ్జముల నిశ్చలభక్తి భజించువారికిన్
రుజ లణఁగున్, మనోవ్యథలు రూపఱు, పాపము లాఱునంటఁ న
క్కజముగ సర్వవాంఛ లొడికంబుగఁ జేకుఱు నిండు నందు, నీ
రజసమపాద! శిష్టజనరక్షణకారణ! వేంకటేశ్వరా !

ఉ॥ క్షీరపయోధిలో మణులు, కాలవిషమ్మున మంచిమందు, దు
ర్వారమహాగ్నికిన్ బ్రభలు, లూతను గప్పకు జీవనంబు, పెం
పారఁగ నుక్కుతీఁగెకు మహాద్భుతనాదము సంఘటించు, నీ
సారమనోజ్ఞశక్తికి నసాధ్యము లున్నవె? వేంకటేశ్వరా!

చ॥ చందురునందుఁ గందు మఱి చందనపుం దరువందుఁ బాములున్
విందగులే గులాబికిని బెల్లుగ ముండ్లును సాగరాంతరం
బందున బాడబాగ్నియును. హాటకమందునఁ గర్కశత్వ మే
పొందఁగఁగూర్చు నీమహిమ యూహలకందునె? వేంకటేశ్వరా!

ఉ॥ నీవు మనోజ్ఞమూర్తివి, వినిర్మలకీర్తివి, భక్తచిత్తసం
భావిత పుణ్యమూర్తివి, విపాటితకల్మషజూర్తి వీవ; నా
దైవము తల్లిదండ్రియును, దాతవు నేతవు నీవె యంచు, నీ
పావనపాదపద్మములఁ బట్టి భజించెద; వేంకటేశ్వరా !

ఉ॥ మును మునిశేఖరప్రతతిపూన్కిఁదపోఽధిక యోగశక్తిచేఁ
గన వినరాని యద్భుతపుఁ గార్యములే యొనరించె నిప్పు కూ
డను గడుదొడ్డకార్యము లడావుడిగా ఘనయంత్రశక్తిచే
తను బొనరించుచుండిరి బుధప్రవరావళి, వెంకటేశ్వరా!

చ॥ సరసిజనాభ! నిన్నుఁ గనఁజాలని కన్నులు కన్నులే, నిరం
తరము భవత్పదార్చన నొనర్పని చేతులు చేతులే, యశ
స్కరమగు నీచరిత్ర వినఁజాలని వీనులు వీనులే, భవ
చ్చరణమరంద మానని రసజ్ఞ రసజ్ఞయె, వేంకటేశ్వరా!

చ॥ కువకువలాడు కోకిలపుఁ గూఁత విధాన బుధాళి మెచ్చఁ గ్రొం
జవి గల ముద్దుపల్కులఁ బసందగు తేనియసోన లూరఁ బ్రా
గ్భవగత పుణ్యసారమునఁ గల్గిన మత్కవితన్ నిరంతరో
త్సవమున నీపదద్వయి నెసంగ నొసంగెద; వేంకటేశ్వరా!

ఉ॥ ఒక్కఁడు తిండిలేక, మఱియొక్కఁడు యోగములేక తిండి, కిం
కొక్కఁడు సంతులేక, పయి నొక్కఁడు సంతును బెంచలేక, వే
ఱొక్కఁడు కష్టమొందనిఁక నొక్కఁడు సౌఖ్యమునొంద, లోకమీ
ఫక్కి సృజించి వేడుకలు పర్వగఁ జూతువె? వేంకటేశ్వరా!

ఉ॥ జ్ఞానధనంబు గల్గఁ గొనసాగని దుండునె ధాత్రియందు? వి
జ్ఞానధనంబె సౌఖ్యమును, స్వర్గము నిచ్చెడు, మేటిభాగ్య; మ
జ్ఞానములేమి యంచును మనంబున ధీనిధు లెంచుచుందు, రా
జ్ఞానధనంబె నాకెపుఁ డొసంగుము కూర్మిని వేంకటేశ్వరా!

ఉ॥ యోగముఁ బూనుమాత్రమున యోగినిగాను మహాద్భుతంపుబై
రాగితనాన నీదరికి రాఁగ విరాగినిగాను, నిర్భర
త్యాగముచేత నీమదినిఁ దన్పఁగఁ ద్యాగిని గాను, నీదు పూ
జాగరిమంబు నిత్యమును సల్పెడి దానుఁడ వేంకటేశ్వరా!

చ॥ నలినము నాచుతోఁ గలసినన్ గద కంటికి నింపుఁ గూర్చు? నా
కలువలతేనికిన్ నడుమఁ గల్గిన మచ్చ మనోహరమ్ముగా
వెలుగదె" యట్లె సత్కవికిఁ బేదతనం బది పుట్టుమచ్చయా?
లలితకలాకలాపశుభలాంఛనమండన! వేంకటేశ్వరా!

చ॥ శ్రమము నడంపఁగాఁ దగిన సాధన మింపగు మాట, ఘోరతా
పము నడగింపఁగాఁ దగిన వర్మము చల్లని నీటితేట, మో
హము నడలింపఁగాఁ దగిన యానము తియ్యని జ్ఞానగోష్ఠి. పా
పము హరియింపగాఁ దగిన బాట ద్వదాఖ్యయె; వేంకటేశ్వరా!

ఉ॥ సారగుణుండు సంతతము సజ్జనరక్షణ సల్పఁబూనుటే
యారయ వాని వృత్తి తను వారడి బొందిన నైన, నెండ ధా
త్రిరువా మేవునన్ దల ధరించుచుఁ జెంతకుఁ జేరువారి క
వ్వారిగ నీడ నిచ్చి వెసఁ బాపదె తాపము? వేంకటేశ్వరా!

ఉ॥ యాచకులందు నిత్యము దయాపరతంత్రత, భక్తసంతతిన్
గాచుటయందు నేర్పుఁ గలకాలము ముజ్జగమున్ ముదానఁడా
గించిన గీటు దాఁటని స్వకీయమహాద్భుతపాలనక్రియా
వాచక మెన్నగా వశమె? వాక్పతిసన్నుత! వేంకటేశ్వరా !

ఉ॥ చారురసవంబు, వవశైలిమృదుత్వము నక్షిపర్వసం
స్కారమనోజ్ఞరూపము పసందగు పల్కుదళాలు, భావవి
స్తారపుఁ గమ్మఁదావి వెదచల్లు మదీయ కవిత్వ సూనసం
భారము నీపదద్వయి సమర్పణ చేసెద; వేంకటేశ్వరా !

చ॥ అణువున, మేరు భూధరము నందున సూక్ష్మములైన నీరపుం
గణముల, నంబరస్థలిని, గంధిని ధారుణియందుఁ గూడ ను
ల్బణముగ నొక్కచందమున వాసిగ భాసిలుసట్టి సర్వకా
రణమయకారణుండ వగు బ్రహ్మమవౌదువు వేంకటేశ్వరా

ఉ॥ దారువునన్ ధనంజయు విధంబున, దావకదివ్యతేజనం
భారము లెల్లలోకముల వ్యాప్తముఁజెంది సమస్తజీవనా
ధారము లౌచు నుండుఁ గద త్వాదృశశక్తి నెఱుంగనేర, నీ
చారుకృపారసంబు వెదచల్లుము నాపయి, వేంకటేశ్వరా!

ఉ॥ ఆయువు నూఱువత్సరము లైనను నందు సగమ్ము నిద్రలోఁ
బాయును, దానిలో సగము బాల్యజరారుజదుఃఖపాళిచే
మాయును దానసామ్ముఁ జను మర్త్యునకీ తనుపోషణార్థ మిం
కీయెడ, దేహికిన్ సుఖ మదెక్కడనోగద వేంకటేశ్వరా !

ఉ॥ ధర్మపథంబు తప్పి వివిధంబగు మాయలు పన్ని, యెట్టిదు
ష్కర్మ మొనర్చియైన సిరిసంపద లార్జన చేయుచుండుఁ దే
యత్నములఁ గార్యమంచు. మనమందుఁ దలంచునుజీవి, యాతను
వర్మ మశాశ్వతం బనుచు భావనసేయఁడు, వేంకటేశ్వరా!

చ॥ బలఁడగువాఁడు పైఁబడిన వంగి యడంఁగినవాని కెప్డు మే
ల్గలుగు, నెదుర్చ నాపదలుగల్గు, నదుల్ వడిఁబొంగి పాఱుచో
దలలను వంచి మించవె లతల్? వెస నిక్కినయట్టి వృక్షముల్
గలగల మంచు నేలఁ బడుఁగాదె రయంబున? వేంకటేశ్వరా!

చ॥ కలిని జనాళి దుర్బలము గావున కొండల నేడు నెక్కి నీ
సలలితమూర్తి విం గనగఁ జాల దటంచని ప్రేమమీఱఁ గొం
డల వడి నెక్కి బస్సులు హుటాహుటి వేసి ధరాజవాళి కే
యాలసలు లేక చేసితిగదా! కరుణాకర! వేంకటేశ్వరా !

ఉ॥ చిక్కని భక్తి నాహృదయసీమ మెలంగఁ దెలుంగు పద్యముల్
మక్కువ వ్రాయఁ బూనితిని మన్నన నిత్తువొ? చిన్నపుత్తువో
తిక్కనవోలెఁ జెప్పఁగల తేఁకువ కల్గదు, "పిండి కొంచెమే
చిక్కిన రొట్టె పెద్దదిగఁ జేయగ వచ్చునె?" వేంకటేశ్వరా!

ఉ॥ ఎంతటి గ్రంథమం దయిన నెవ్వియొ తప్పులు కొన్ని గల్గగో
రంతలు కొండలంతగ నిరంతర మెంచుచు నేవగించుటే
సంతసమైన తోవయొ? నిశాకరుమేనఁ గళంక ముండినన్
గంతు విరోధి దాల్పఁడె సిగన్‌దగ వానిని? వేంకటేశ్వరా!

ఉ॥ ఐహికభోగకాంక్షలకు నంతును బొం తగుపింపఁ బోవ దీ
దేహికి, వానివల్ల గణుతింపఁగ సౌఖ్య మొకింతలేదు, వే
యూహలు మాని భక్తి రసమూరఁగ నీనుతి సేయువాఁడు సం
దేహము లేక ముక్తిఁ గనునేకద రూఢిగ? వేంకటేశ్వరా!

చ॥ కలియుగ మందు నాశ్రితనికాయములం బరిరక్షచేయగాఁ
దలఁచి వికుంఠమున్ విడిచి దబ్బున తిర్పతికొండనిల్చి ని
శ్చలమగు భక్తి నీదు పదసారసయుం దలపోయువారి, బల్
సిలుగులువాపి ప్రోచెదవు శేషగిరీశ్వర వేంకటేశ్వరా!

చ॥ పలపతిపొందు పాపమని పంక్తిముఖుండు నెఱుంగఁడో? దురో
దరమున నేఁగి గల్గునని ధర్మతనూజుఁ డెఱుంగఁడో? రఘూ
త్తరుఁడు పసిండి లేడి వితథమ్మలనంచు నెఱుంగఁడో? సుధీ
గరిమ నశించుఁగాదె పెతగల్గెడు వేళను? వేంకటేశ్వరా!

ఉ॥ చల్లని నీకృపామృతరసమ్మును బ్రేమ దలిర్ప నాపయిన్
జల్లినఁ జాలుఁ బూర్వభవసంచితపాపపలాశ బృందముల్
ద్రుల్లును, నాదు జన్మముగడున్ గృతకృత్యతనొందియెందుశో
భిల్లును నీశుభాహ్వయరవిప్రభ యట్టిది; వేంకటేశ్వరా!

ఉ॥ శరణు సమస్త భక్తజనసత్కృత పూజితపాదపంకజా!
శరణు సమస్తదేవగణసన్నుత దివ్యకలావిభూషితా
శరణు చరాచరాఖిల విశాలజగద్వలయైక రక్షకా!
శరణు కృపామృతాంబునిధి చారుసుధాకర! వేంకటేశ్వరా!

చ॥ దినమణి యొక్కఁడైన జగతిన్ గల జీవుల కెల్ల వేఱువే
ఱనఁగను దోఁచుచందమున నబ్బురమైన చరాచరాఖిలాం
బునిధిపరీతమై పరఁగు భూమిని నీవొకరుండె దైవమై
ననుబలురూపనామముల నల్వుగఁ దోఁచెదు; వేంకటేశ్వరా!

చ॥ కళపెళమంచు నెల్లపుడుఁ గాఁగుచు వేసవి వేఁడిచేత ను
జ్జ్వలతర తాపతప్తమగు సస్యములన్ ఫలియింపఁ జేయు నా
వలిమలపట్టిచందమున వ్యర్థపుసంసృతియందుమున్గు జీ
వులను దయాఖ్యవర్షమున బ్రోతువజస్రము వేంకటేశ్వరా!

చ॥ నిలిపెద నిన్ను నాహృదయనీరజమందు ననారతంబు నేఁ
దలఁచెద నీదునామము ముదంబున నామది నెల్లవేళ నే
మలఁచెద నీదురూపమును మన్మతి భిత్తికయందు నిత్యమేఁ
గొలిచెద నీదుపాదము లకుంఠితభక్తిని వేంకటేశ్వరా!

ఉ॥ వ్రాయుట నాదువంతు, మఱి భావసుధారసధార లొల్కఁగాఁ
జేయుట వాణివంతు, మదిఁజిప్పిలు భక్తినిఁ గావ్య మచ్చుగా
వేయుట దాతవంతు. వెనువెంటనె సర్వశుభాలుగూర్చి కై
సేయుట నీదువంతు సుమి శేషగిరీశ్వర! వేంకటేశ్వరా!

ఉ॥ ఇంచుక జాగులేక గమియించు దివంబున నంశుమంతుఁ డొ
క్కించుక కాలయాపనమునేని యొనర్పఁడు తిక్కఁడేఁడు తా
నంచును దాఁటిరాఁడుగద యప్పతి తావకశాసనంబు నొ
క్కించుక దాఁటిపోవఁ గలరే సురలైనను? వేంకటేశ్వరా!

ఉ॥ చక్కనిరూపుతోఁ గృపను జల్లెడు చల్లనిచూపు నేపుతోఁ
జిక్కని కప్రపున్ రుచులు జిందెడు తియ్యని పల్కు తేనెతో
నొక్కులులేని ప్రేమమును నూల్కొనఁజేయు మనోఽంబుజంబుతో
గ్రక్కున కానిపింపుమని ప్రార్థన సల్పెద వేంకటేశ్వరా!

ఉ॥ అక్షయసర్వసౌఖ్యతతు లాదరమార నొసంగి ప్రోవఁగా
దక్షుఁడ వీ వటంచు సతతంబు మనంబున నెంచి యోజగ
ద్రక్షక! నీమనోహరపదద్వితయంబును నద్దుకొంచు నా
యక్షుల నెప్డు నిన్ను శరణంచు భజించెద, వేంకటేశ్వరా!

చ॥ పడమటిరాజ్యపాలకులుఁ బాయనికిన్క మహోగ్రయంత్రముల్
విడువని పూన్కితోడఁ బ్రభవింపఁగఁ జేసి రణం బొనర్పఁగాఁ
గడఁగెదరార! భీతిలు జగ మ్మఖిలమ్మను నేఁడు దుష్టులన్
బొడ వడఁగించి శిష్టులను బ్రోవవె వేగము వేంకటేశ్వరా!

చ॥ జడధిపరీతమౌ ధరణిచక్రము నాచు నిహారభూమి, యె
ప్పుడు నిటధర్మవిప్లవముఁ బుట్టునొ, యప్పుడె బుట్టిదుష్టులన్
గడఁగి వధించి, శిష్టులను గాచెద నంచు వచింపలేదొకో?
యుడుగని ప్రేమతోడ నిగమోత్తమతల్పక! వేంకటేశ్వరా!

ఉ॥ ఎట్టిజపంబు చేసితినొ? యెట్టి తపంబులు సల్పినాఁడనో?
యెట్టిపవిత్రదానముల నే నొనరించితినో? ముదాన ని
ప్పట్టువనంపుఁ బూర్వభవపుణ్యమునన్ గనిపట్టితైత ని
ప్పట్టున నీదు పాదములపజ్జను నిల్చెద వేంకటేశ్వరా!

చ॥ జలజల మంచు శబ్దములఁ జల్వను నీగుణవర్ణనంబు ని
చ్చలును సరోవరాలు సుడఁ జల్లెడు తీయని గొంతులెత్తి కో
కిలలు నుతించు నీవిమలకీర్తిని జిల్కలు తావకీన లీ
లలు వినదించు నిత్యము నిలాతలమందున వేంకటేశ్వరా!

చ॥ గుణుఁడవొ? నిర్గుణుండవొ? నిగూఢుఁడవో? బహుళాత్మకుండవో
ఘనుఁడవొ? యల్పమూర్తివొ? వికారివొ? నీవవికారమూర్తివో
కన నగువాఁడవో? వెలికిఁ గానఁగరావొ? యెఱుంగఁ గాని నే
ననిశ మెఱుంగుచున్ మది దయానిధిపాటను వేంకటేశ్వరా!

చ॥ కలుష మడంపు మంచు నిజకర్మమునన్ ఘటియిల్లు రోగసం
కలనముఁ బాపుమంచు సిరిగల్గఁగఁ జేయు మటంచు సద్యశః
కలసముఁ గూర్చుమంచు జనకాండము భక్తిని నీపదాంబుజ
మ్ములు భజియించి వాంఛలను బొందదె పొందుగ వేంకటేశ్వరా!

చ॥ వినవొ? పరాకొ? నానుతులు వీనుల కెక్కవొ? లేక కోపమో?
మునిసుతమార్గముల్ విడిచి మూఢతతోఁ జరియించినాఁడవో?
ఘనులను దూఱినాఁడనొ? వికారమనస్కుఁడనైతినో? యెఱుం
గను, దయజూపి కావు మని కైమొగిడించెద వేంకటేశ్వరా!

చ॥ ప్రణుతి యొనర్తు నిన్ను భవబంధవిదారణ! భక్తకారణా!
వినతి యొనర్తు నీకు పరవేదశిరోమణి! భక్తహృన్మణీ!
వినుతి యొనర్తు నీకు మునిబృందకృపావన! లోకపావనా!
జనవు గలట్టి నీకృపను జల్లుము నాపయి వేంకటేశ్వరా!

ఉ॥ పాపసముద్రమందుఁ బడి ద్వంద్వశిఖిచ్ఛటఁ గ్రాఁగుచుంట సు
ద్దీపితమైన ఖేదమునఁ ద్రెళ్ళెడు మర్త్యుల నోమి తీరమున్
సాపుగఁ జేర్పఁగాఁ దగినసాధన నీదు పవిత్రసుందర
శ్రీపదపోతమొక్కటియె చేవ గలట్టిది వేంకటేశ్వరా!

ఉ॥ తావకసత్కథాసుధ ముదమ్మున వీనులలోనఁ జడ్డ నే
జీవికిఁ బులకలేర్పడవొ? చెచ్చెఱరాలవొ హర్షబాష్పముల్
వావిరిగాఁగ వాఁడు తలఁపన్ బురుషాధముఁ డంచుఁ గష్టపా
పావిలమానసుండనుచు నాడఁగ నొగద! వేంకటేశ్వరా!

చ॥ శ్రితులకు భూషణమ్ములగుచున్ గడు నింపునుసొంపుఁ గూర్చుస
న్మతులకు జ్ఞానసంపద లనారమున్ దమి నిచ్చుచుండు, మా
వెతలకు శోషణమ్ములయి వేడుక నిత్తువు, త్వత్పదార్చనా
వ్రతులకు నెల్లకాలము ధరాతలమందున: వేంకటేశ్వరా!

చ॥ ధనములు ధాన్యరాశులును దారసుతాదులు క్షేత్రజాలముల్
మణులు దుకూలవర్గములు మానినులున్ బహుగేహసంతతుల్
వనములు బంధుమిత్రులును వావిరి సౌఖ్యమొసంగఁ జాలునే
తనరెడు నీదుసన్నుతియె తప్ప ధరాసలి? వేంకటేశ్వరా!

ఉ॥ స్వాదుఫలంబులిచ్చుఁ దరుసంతతు లాపయిఁ దృష్ణఁదీర్ప స్వా
దూదక మిచ్చుఁ బుష్కరిణు లుద్ధృతమైన గుహాని వేశముల్
మోదముతో సృజించి యిడ మూర్ఖులు శాంతినిమాని తుచ్ఛభో
గాదులకై యశాంతియుతు లయ్యెదరయ్యయొ వేంకటేశ్వరా!

ఉ॥ వింటిని నక్రవక్త్రపరిపీడితమౌ గజరక్షణమ్ము బల్
తుంటరులైన కౌరవులు ద్రోవది వల్వలు విప్పఁబోవ కా
పుంటయు నాశ్రితావనుల నోమెడు దైవత మంచు వింటిఁజే
కొంటివి వేఁడుకొంటి ననుఁగూర్మిని నేలఁగ వేంకటేశ్వరా!

ఉ॥ అర్థనిమేషమైన విషయాదుల నిల్వని చిత్తవృత్తితోఁ
బ్రార్థన చేయుశక్తి కలుషాదుల యందు విరక్తి నుంతయున్
స్వార్థములేని భక్తి యనయంబొనఁ గూర్పఁగదయ్య! నాకు సి
ద్ధార్థునిరీతి జీవితఫలాశయ మొందఁగ వేంకటేశ్వరా!

ఉ॥ సనకసనందనాదిమునిసంతతు లెంతటి పుణ్యశాలురో
తనివి దలిర్పఁదావక పదద్వయి నిత్యముఁ గొల్చుచుందు;రిం
పెనయఁగ నీదుదర్శనము నెల్లపుడుంబొనరింతు రాపయిన్
వినయముతోడఁ జేయుదురు ప్రేమను నీనుతి వేంకటేశ్వరా!

ఉ॥ చల్లని చూడ్కి చాలు వెదచల్లుచు బిడ్డలఁ దండ్రివోలె జొ
బ్బిల్లిన ప్రేమపిచికలు పెంపెసఁగన్ దొనఁకాడ సౌఖ్యమం
దల్లన ముంచి సంతసమునందుచుఁ గంటికి రెప్పరీతి మ
మ్మెల్లరఁ గాచుచుందు వుదయించిన వేడుక; వేంకటేశ్వరా!

ఉ॥ శ్రీయుతమై ముముక్షుజన సేవితమై జనలోకమోదనం
ధాయకమై యఘౌత్కరవిధారకమై రణరంగవిస్ఫుర
త్సాయకమై శ్రితాళివరదాయకమై వృషనామభూధరా
ధాయకమై వెలింగెడు పదంబులఁ గొల్చెద వేంకటేశ్వరా!

ఉ॥ నీరజనాభ! నీదుపదనీరజముల్ మదినమ్మి గొల్తు రె
వ్వారలు, వారికిన్ నరకబాధలుగాని, విపత్కణంబుగా
నీ రుజగాని లేకయె మునీశ్వరు లందెడు మోక్షసౌఖ్య ను
స్వైరవిహార మబ్బును నిజమ్ము నిజమ్మిది, వేంకటేశ్వరా!

చ॥ సలుపఁగలేదు సంతతము సజ్జనసేవలు దానధర్మముల్;
తలఁపఁగలేదు సంతతముఁ దావకమూర్తిని నాత్మయందు; నే
గొలువఁగలేదు సంతతముఁ గోవెలలందుఁ ద్వదర్చనావిధిన్;
నిలిపితి నీపదద్వయమె నిత్యము నామది, వేంకటేశ్వరా!

చ॥ అసదృశమైన పాపతతు లావిధిచేత లిఖింపఁజేయు నా
నొసటను నీకుదోఁచినటు నూఱునువేలునుగాని, దేవ, యే
రసికతలేనివారలకు రమ్యకవిత్వ నివేదనోద్యమ
వ్యసనముమాత్రమించుకయు వ్రాయఁగఁ జేయకు వేంకటేశ్వరా!

ఉ॥ ఇమ్మహియందు జీవతతి కేరును సౌఖ్యముఁగాని దుఃఖసం
ఘమ్ములుగాని యేవిధముగా ఘటియింపఁగలేరు పూర్వక
ర్మమ్ములఁ బట్టి వారలకు బ్రాప్తము లౌనవి కాన నేఁటి జ
న్మమ్మునఁజేయఁగావలయు మంచిపనుల్ తగ; వేంకటేశ్వరా!

ఉ॥ నీవు దయామయుండవు పునీతమనస్కుల నెల్లవేళ బా
పావిలపంకమందుఁ బడునార్తుల రక్షణ సేయుచుందు వో
దేవ! భవత్పదాబ్జములె దిక్కని నమ్మి చరించుచుంటి నా
సేవల నాదరించి కృపసేయుము శ్రీపతి వేంకటేశ్వరా!

ఉ॥ ఎన్నటికేని నీమమది కెక్కఁగఁ బోదు మహార్తి పూర్ణమౌ
విన్నపమంచు భక్తి మెయి వేఁడుచుఁ బాడుచు జీవితంబు నీ
కెన్నన గెంటుచుంటి భవదీయకృపారసవీక్షణావళిన్
దిన్నగ నాపయిన్ నెఱపి తేర్పవె క్రొమ్ముక్కెద వేంకటేశ్వరా!

ఉ॥ ఓ కరుణాపయోనిధి! మహోన్నతచిత్రచరిత్ర! నీదు సే
వాకుతుకంబునే హృదయపద్మమునందు సతంబు నెంచెదన్
మాకవితాకుమారి, సుకుమారి; భవద్దయ నింపి వేడ్కతోఁ
జేకొనుమయ్య పత్యహము సేవలొనర్పఁగ; వేంకటేశ్వరా!

ఉ॥ ఉగ్రతపైనదీక్షమెయి నుగ్రతపంబులు నిన్నుఁగూర్చి పే
రగ్గలికన్ మునిప్రవరు లాదటఁ జేసియునైనవారు నీ
పగ్గెయు నీదురూపుఁ దలఁపన్ దిలకింపఁగ లేరు, భక్తి నీ
దగ్గఱఁ జేరనెంచు నను ధన్యునిఁ జేయవె? వేంకటేశ్వరా!

ఉ॥ నీదుచరిత్ర నెన్నఁదగునే యిదమిత్థమటంచు ధాత్రి నా
మోద మొసంగ సర్వసురపుంగవకోటికి నైన? సల్పెడన్,
మీఁదను జ్ఞానహీనుఁడను మేదురమైన భవత్కృపామృతా
స్వాదముఁగోరి వేఁడితిఁ బ్రసన్నతఁజూడవె; వేంకటేశ్వరా!

చ॥ సకలజగత్ప్రభుండ వయి సర్వమెఱింగిన యట్టి నీకు మా
మక మగుభావ మిట్టిదని మాత్రముఁ దెల్పఁగనేల? దేవ? నీ
ప్రకటదయావిశేష విభవప్రభవాదులచేఁ జరాచర
మ్మకుటిల మౌగతిన్ జను దయామృతసాగర! వేం. టేశ్వరా!

ఉ॥ శారదవేళ హంసములు జాహ్నవిఁ జేరెడు మాడ్కి నోషధీ
వారము రాత్రి వేళలఁ బ్రభన్ దులకించెడు భంగి, వృక్షముల్
చారువసంతమాసమునఁ జాలఁగ శోభిలునట్లు భక్తు లిం
పారఁగ ముక్తులౌదురు త్వదంఘ్రిసపర్యనె వేంకటేశ్వరా!

ఉ॥ ఎవ్వఁడు మోహసంతమస మెల్ల నడంగఁగఁ జేయుచుండు నిం
కెవ్వఁడు సర్వమాన్యుఁ డెవఁడేలు జగంబుల లీలఁ గ్రాలగా
నెవ్వఁడు సర్వశక్తి పరమెవ్వఁడు మేటిదయానురాగమే
యెవ్వనిసొత్తొ యట్టిఘనుఁడీవె ధ్రువమ్ముగ వేంకటేశ్వరా!

చ॥ అమృతమువోలె స్వచ్ఛమయి యంబుధివోలె మహాగభీరమై
హిమగిరిభంగి గొప్పదయి యింద్రునియట్లధికారపూర్ణమై
సమముగ నష్టదిక్కులను జాలఁగఁ దాఁకు యశస్స్వరూపమై
యమమనొ యట్టినీనుతిమహత్త్వ మమేయము వేంకటేశ్వరా

చ॥ పుడమిని రాజ్యసంపదలు బుద్బుదముల్ కద, రూపయౌవనా
లడఁగును లిప్తలోన స్థిరమైనది నీపదసేవ గాన జీ
వుఁడు నినుఁ బూజసేయుటకుఁ బూనుట మంచిది దీపమున్న య
ప్పుడె యిలుచక్కఁ బెట్టుకొనఁ బూనుట మేల్గద? వేంకటేశ్వరా!

ఉ॥ అన్నములేమ కొన్ని మధురాంబువులున్న వటంచుమున్ను పో
తన్న వచించినట్టి నుడి తథ్యమ మయ్యెను నేఁడు నాయెడన్
బన్నము లీఁగరానిగతిఁ బట్టిపలార్చుచునున్న వయ్యయో!
గ్రన్ననఁ బ్రేమ చిల్కి కడగండ్లను బాపవె? వేంకటేశ్వరా!

చ॥ కులుకుచు నేర్చినట్టి పలుకుల్ చెవికింపుగఁ బల్కు చిల్క స
ద్గళము బిడాల మొక్కతఱి గట్టిగఁ బట్టఁగఁ "గీచుకీచు" మం
చలజడి చేయుఁ గాని బలుకాడునె? యట్టులె మిత్తి డాయుచో
బలుక వశంబె నీసుతులఁ బ్రాణభయంబున? వేంకటేశ్వరా!

ఉ॥ కాలము గ్రిప్పి కన్నులొడికంబుగ వాయువు మ్రింగుటన్ గనన్
జాలక మర్త్యుఁడాశ యను జాలినిఁ దూలి ధనార్జనార్తికిన్
బాలగుఁ గాదె? భేకమును పాము గ్రసించెడు వేళ నాశచే
నాలుక చాఁపదే క్రిమిఁదినన్ దలపోయుచు? వేంకటేశ్వరా!

ఉ॥ నమ్మక మించుకంతయు మనమ్మునఁ గల్గని వట్టి శుంఠకున్
గమ్మని నీచరిత్ర గుతుకమ్మునఁ దెల్పినవాఁడు సుంతయున్
నమ్మనె కల్పితమ్ములని నవ్వును రంధ్రముఁ గల్గునట్టి కుం
భమ్మున నీరు నిల్పుటకు బ్రహ్మకు నౌనొకా? వేంకటేశ్వరా!

ఉ॥ ఆధులవ్యాధులందు సెగలారని యీర్ష్యలమధ్యఁ జిక్కి ని
ష్కేదపదావలంబ మగుచిత్తముతో నినుఁ బాడి తత్సుధా
మాధురిఁ జిక్కఁ బోవ కిటు మగ్గములందలి కండెలట్లుగా
బాధలఁ జిక్కు నీనరులఁ బాలన సేయవె వెంకటేశ్వరా!

చ॥ కలిగినదానఁ దృప్తి పడఁగల్గిన నుండదు లోటు సుంత! దా
నెలమిని నిండు తృప్తిని వహింపఁగఁ జాలనివాఁడు సర్వమున్
బలపలమందు లోటు గనుపట్టును వారిధి కంతమున్నదే?
తలపఁగ నాశ కంతు గలదా యెటనేనియు? వేంకటేశ్వరా!

ఉ॥ కనులను మూసికొంచుఁ దమకమ్మునఁ బాలను గ్రోలు పిల్లియ
ట్లనె మనుజుండు పాపగతులన్ జరియించుచు తన్ను నెవ్వరున్
కనుగొనుచుంటలేదని మనంబున మూర్ఖతనెంచుఁగాని నీ
కనులను మూయ శక్యమె? యఖండదయాకర! వేంకటేశ్వరా!

ఉ॥ చిత్తములందు భోగములచింత వహింపను; స్వర్గసౌఖ్యసం
పత్తు గ్రహింప నెంచను; బ్రపంచపుమాయలఁ జిక్కి సంతతా
పత్తులఁ గ్గుజన్మముల కంజలిఁ బట్టను; "గుమ్మరావమం
దిత్తడిముంత యుండునె? మహాన్సుఖమెక్కడ? వేంకటేశ్వరా!

ఉ॥ మానసమందు లుబ్ధు ననమానవదాన్యత నమ్మి కార్యమున్
బూనినచోఁ బ్రయాసమును బొందుట తక్క నికన్యముండునే?
"జానగునట్టి మేఁక మెడచన్నుల నాశల పాలు పిండఁగాఁ"
బూనినచోఁ గృతార్థతనుఁ బొందఁగ వచ్చునె? వేంకటేశ్వరా!

చ॥ లలితభవత్పదాబ్జ పరిపాలిత తత్పరుఁడైన భక్తుఁ డే
గలుములలోనఁ జిక్కినను, గష్టములన్ బడి స్రుక్కుచుండినన్
బలువలమధ్యనున్నను స్వభావమునందున మార్పుఁజెందునే?
కలియునె వెన్న మజ్జిగను గల్పిననైనను? వేంకటేశ్వరా!

చ॥ తిరుగలిలోన బియ్యము ద్రిప్పిన గింజలు పిండి పిండిగాఁ
బరఁగిన భంగి మానవుఁడు భక్తి ఘరట్టములోనఁ బాపముల్
గిరగిరఁ ద్రిప్పఁ బ్రాగ్జననకిల్బిషముల్ వెసదుల్లి వాఁడు నీ
పరమపదంబుఁ జేరఁగద? పాతకనాశక! వేంకటేశ్వరా!

ఉ॥ వీనులవిందొనర్చు మునిబృందములన్ దనియించు నీపద
ధ్యానము మాని మూర్ఖులు భవాంబుధి మున్గఁదలంతు; రెల్లెడన్
జానుదలిర్చు చంపకరసాలముఖావనిజమ్ము లుండఁగాఁ
బూనిక నొంటె తాఁజనదె ముండ్లను మేయఁగ వేంకటేశ్వరా!

చ॥ అలయక "కావు-కావు"మని యాదర ప్రమూఢములైన కాకిమూ
కలు తెలవాఱుటే మొదలుగాఁగఁ బ్రదోషముదాఁక శ్రీశ! ని
న్నలఘుతరారవారభటిఁ బ్రార్థనసల్పును; బ్రార్థితా! మను
ష్యులొ, మఱి "కాఫికాఫి" యనుచున్ బలవింతురు వేంకటేశ్వరా!

చ॥ అమృతరసస్వరూపమగు నక్షరపంక్తులలోని, దివ్యవ
ర్ణములకలాపమై విబుధరంజకమై బహుసౌఖ్యదమ్ములై
ప్రమదముఁగూర్చు నీదు మధురంబగు నామము నాల్కమీఁద ని
త్యముఁ గదలించువాఁడుగద ధన్యుఁడు మాన్యుఁడు? వేంక॥

చ॥ అనుకొనరాని వాంఛలకు నగ్గమునై ప్రతికూలకాలవా
హిని నెదురీఁత లీఁది యిపుడెంతయు డస్సి కృశించి నేఁడు నీ
యనుపమ పాదపద్మముల కంజలిచేసి భవత్కృపామృతం
బును జిలుకంగ వేఁడెదఁ బ్రపూర్ణదయాకర! వేంకటేశ్వరా!

ఉ॥ తాతలుఁ దాతతాతలును దాతలు తాతలు మున్ను చాలఁ బ్రి
ఖ్యాతిఁ గలట్టి పండితమహాశయులంచు యశమ్ముఁగాంచి రా
నేతల పేరు చెప్పి యిడ నేర్చితిఁ గబ్బముఁ జెట్టుపేరఁబం
డ్లేతరి యమ్మురీతిగ నిదే గ్రహియింపుమి వేంకటేశ్వరా!

ఉ॥ కమ్మని నీగుణమ్ములను గానము చేయుచు సాంద్రభక్తి వ
స్త్రమ్ము ధరించి వాంఛలను దాల్పక దుష్టులు కూయుకూఁత ల
క్ష్యమ్ము నొనర్పఁ బోక కలకాలము నిన్నుఁ దలంచువాఁడు సౌ
ఖ్యమ్మును గాంచుఁదా నిహపరాప్తి నినెంతయు వేంకటేశ్వరా!

ఉ॥ వచ్చినరాత్రులే మరల వచ్చుఁ; బవళ్ళును గూడ నట్టులే
వచ్చుచుఁ బోవుచుండును:ప్రపంచములో జనులెల్ల సంసృతిన్
జచ్చుచుఁ బుట్టుచున్ వృధగ సంపదకై తపియింతురి:భక్తితోఁ
ద్వచ్చరణాబ్జయుగ్మమును బట్టి తరింపరు వేంకటేశ్వరా!

చ॥ జనములజీవితమ్ము లిల జంచలముల్ చపలంబులట్లు గా
వున స్థిరమైన నీపదముపొంత వసించుచు భక్తియుక్తులై
మనమును వాక్కుఁగాయము సమర్పణచేసిన యట్టి ధన్యులే
కనవినరాని సౌఖ్యములఁ గాంచెద రెప్పడు వేంకటేశ్వరా!

ఉ॥ పారెడువాగు నీరమటు ప్రాయము చల్లఁగ జాఱు మబ్బులోఁ
జాఱుమెఱుంగు చందమున సౌఖ్యములల్లన మాయఁమౌనెదో
దారిని గాంచి మృత్యువు పదంపడి పైఁబడి యాహరించు నీ
ధారుణిఁ గీర్తియొక్కటియె తప్పక నిల్చును వేంకటేశ్వరా!

ఉ॥ జలజల నూటకాల్వవలె సాగెడు నాకవితాకుమారి కే
యలసట గల్గెనో రుజయు నందెనో? ముద్రణలేని హేతువన్
కలఁత మనంబులో నిలిపి కందెనొ? మైమర పంకురించెనో
మిలమిల మంచు సాగదుసుమీ! గుణసాగర! వేంకటేశ్వరా!

ఉ॥ ఎన్నఁడు తాఁకునో తరగలెత్తఁగఁ గమ్మని తావి యూర్పులిం
కెన్నఁడు సోఁకునో మధల నీను దయార్ద్రిపుఁ జూపులన్ జగా
వన్నె పసిండపూతచెలువమ్ములు నాపయిఁ గ్రుమ్మరింతువో
యన్న నిరంతరాశ హృదయమ్మునఁ బూనితి వేంకటేశ్వరా!

చ॥ బలిమిని రెండుచేతులను బట్టి చలమ్మున లాఁగ సాగి త
ద్బలమగుపట్టు వీడిన యథాగతి రబ్బరు నొందునట్లు చం
చలమతి నీదుపాదముల సన్నిధి నిల్పఁగ నిల్వఁబోదు ని
ష్ఫలములెయయ్యె యత్నములు సాధనమేదిఁక? వేంకటేశ్వరా

ఉ॥ భారతభూమిలోఁ బ్రజలు ప్రాజ్ఞులు సజ్జను లాస్తికుల్ సదా
చారు లటన్నకీర్తి మును సాగెను; నేఁడది వీఁగిపోయె దు
ర్వారపునంప్రదాయ సహవాసముచేతను దాఱుమాఱుగా
భారతభూమిలోఁ బ్రబలెఁ బ్రాజ్ఞహితప్రద! వేంకటేశ్వరా!

ఉ॥ దారిఁ గనంగరాక తలదాఁచుకొనన్ దగు తావు లేక దు
ర్వారవిభావరిన్ బడినవానికి బేటరి దారిచూపి వి
స్తారముదంబు గూర్చునటు సంస్కృతిఁ జిక్కినవాఁడు నీపదాం
భోరుహదీప్తి నంది కడుపొంగు ముదంబున వేంకటేశ్వరా!

చ॥ మృదుమధురమ్ములైన సుకవీంద్రసుధామయవాక్కులాని ప
మ్మదమునఁ గొంతధైర్యమును బూని కృతార్థుఁడనౌదునంచు నా
నుదుటఁ గరమ్ములన్ మొగిచి నూతనశక్తిఁ గృతిప్రసూనసం
పదల నుతించినాఁడ బహుమాన్యునిఁ జేయవె! వేంకటేశ్వరా!

ఉ॥ కొన్నిదినాలనుండి నినుఁ గొల్వఁగఁ జాలకయుంటిఁ గారణం
బెన్నఁగ నీవె దానికిఁ జుమీ! బహుళాంతరచింతలందు నన్
గ్రన్నన ముంప నే నిఁక మనంబున నిశ్చలభక్తితోడ నే
తెన్నునఁ గొల్వఁ జాలుదు? సుధీజనరంజక! వేంకటేశ్వరా!

ఉ॥ వానిది భాగ్యవైభవముఁ వానిది పుణ్యవిశేషకర్మ, మ
వ్వానిది సంపదున్నతియు వానిది ధారుణి మేటిషట్టు వె
వ్వాని మనోజ్ఞ జిహ్వపయి భక్తిరసామృతధార లూను నీ
ధ్యానము సంతతంబు నరుదార నటించునొ? వేంకటేశ్వరా!

చ॥ అసులతపోవిభూతులు మహోధ్వరసంగులు సత్యసంధు లు
త్తములు, పరాక్రమాన్వితులు, దానపదుల్ మహితోపకారసం
యములు, జితేంద్రియుల్, సములు నాపయి భక్తులు గాంత్రుగా దెహా
ర్షమునఁ ద్వదీయపాదజలజాతము లెప్పుడు వేంకటేశ్వరా!

ఉ॥ భారతభూప్రజాహృదయపంకజముల్ వికసింప, నార్షసం
స్ఫారవిలాససంపద దిగంతములన్ వెలుఁగన్ బరస్పరో
దారవివాదముల్ విడిచి ధన్యత నైక్యముఁగల్గి సౌఖ్యసం
భారములందు వర్ధిల శుభంబు లొసంగవె; వేంకటేశ్వరా!

చ॥ ఇడుములు గల్గువేళ వెత లెంచక ధైర్యముఁ బూని ధర్మమా
ర్గపుఁగతి నూని వర్తిలుచు భాసురకీర్తి మనోజ్ఞచంద్రికల్
నిడుపుగ ధాత్రి నెల్లెడల నింపరె, మున్నులభక్తవర్యు? ల
య్యెడుమలె కారణంబులు సుమీ? నినునెంచఁగ; వేంకటేశ్వరా!

ఉ॥ పుట్టినఁనాటినుండియును బొట్టకు, బట్టకు దేవులాటచే
గట్టిగ నీదునామనుతిఁ గంఠముఁ గంపమునొందఁ జేయ; ని
క్కట్టుల మున్గి సౌఖ్యమును గాంచను; సత్కృపతోడఁ బ్రోవకీ
విట్టు లుపేక్షచేసిన మఱెవ్వరు దిక్కిఁక? వేంకటేశ్వరా!

చ॥ బ్రతుకుబెడారిఁ జిక్కి ఐహాభంగుల దప్పికచేత స్రుక్కి దు
స్థితిఁ బయిలోడు పాంథునికిఁ జెంతను నీరముఁ గల్గువాగుదృ
గ్గతికిని దోఁప సమ్మదముఁ గాంచినయట్టి నరుండు త్వత్పద
స్థితనుతభక్తి యబ్బినటు చెందుఁ బ్రమోదము వేంకటేశ్వరా

ఉ॥ బాలరసాలసాల నవపల్లవకోమలకావ్య కన్యకా
పాళి నృపాళి హర్మ్యముల పాలొనరింపక నీదుపాదప
ద్మాళి భజించుకోరిక మదాళిని బోలినదె కవీంద్రసత్
పాళి కృతార్థ మద్దివసుధాస్థలి నెంచఁగ వేంకటేశ్వరా!

ఉ॥ పద్యసుమప్రకాండములు భక్తి తొలంకఁగ నీపదద్వయిన్
హృద్యములుగాఁగ నుంచితిని నిండుఁగలట్టి రసంబుఁ గ్రోలి వం
వేద్యత నావొసంగులను వ్రీలఁగఁ జేసి బిరానఁ బ్రోవఁగా
నాద్యుఁడ వీవెయంచు హృదయమ్మున నమ్మితి వేంకటేశ్వరా

ఉ॥ హాయని భక్తి నీపయిని వ్రాసితి నీశతకమ్ము నేఁడు "మూ
లా"యను నింటిపేరదె చెలంగును పేరనశాస్త్రి పేరు ప్రే
మాయతి దీనినిన్ జదువునట్టి జనాళికి భోగభాగ్యదీ
ర్ఘాయురనేక సౌఖ్యవిభవాదు లొసంగవె? వేంకటేశ్వరా!

# శతపత్రిహారము

శ్రీకర మాత్మభూముఖ విశిష్ట సుపర్వ నమస్కృతమ్ము, లో
కైకశరణ్య, మాశ్రితజనావళి వాంఛిత కల్పకమ్ము, సు
శ్లోక పవిత్ర సంయుత మశోకము, నిర్మల ధర్మకర్మ ర
క్షాకరమౌ భవత్పదము లాదృతిఁ గొల్తును సాయిశంకరా!

ఉ॥ మోదమెలర్ప నీవిమల పుణ్యకథాశ్రవణం బొనర్ప విః
ఖేదముఁగల్గు పాపములు క్రిందగు; దాపములారు; చిత్తమా
హ్లాదము నొందుచుండు, విగతాఖిలదుఃఖమునైన మోక్ష సం
పాదనమబ్బు భక్తులకు భవ్యకృపానిధి! సాయిశంకరా!

చ॥ జయజయ సేవక ప్రకరజన్మ కృతాధిక పాపవారణా!
జయజయ భక్తహృత్కమల సద్మనివాసక సౌఖ్యకారణా!
జయజయ సద్గుణాభరణ! సత్యవిచారణ! ప్రేమధారణా!
జయజయయంచు నిన్ గొలుతు సాధుజనావన! సాయిశంకరా!

చ॥ క్రితువులు, సత్రయాగములు, గాశిగయామధురాప్రయాగతీ
ర్థతతుల సేవచేఁ గలుగు ధన్యతకంటెను నీదునామ సం
స్తుతి నొనరించినన్ గలుగుఁజూ పదిరెట్లు ఫలంబుఁగాన స
న్మతి భవదీయనామనుతి నా కిడ వేఁడెద సాయిశంకరా!

చ॥ క్రతువులు, ధర్మమార్గములు, కారుణికత్వము, భక్తితత్త్వమున్
హత మొనరించునాస్తికత నంత మొనర్చ ధరాతలంబులోఁ
బ్రతియుగమందుఁ బుట్టెదవు పాపము నొంచుచు ధర్మమార్గస
త్కృతులఁ ధరిత్రి నిల్పి కృతకృత్యుఁడ వౌదువు సాయిశంకరా!

ఉ॥ పావనమున్ ముదావహము ప్రాజ్ఞజనప్రమదంబుగాఁగ నాం
ధ్రావళి మోదమంద మృదువైన తెలుంగునఁ బుట్టువర్తి స
ద్భావుఁ బురాణపూరుషుని, భక్తమనోరథపూర్ణు, నిన్ను సం
భావనచేసి పద్యకుసుమార్చితుఁ జేసెద సాయిశంకరా!

ఉ॥ దైవమునందు భక్తి, విబుధప్రభులం దనురక్తి, నిత్యమో
దావహసూక్తి, యన్యవనితార్థవిరక్తి, దురంతసర్వదు
ర్భావవిమర్దనక్రియల బంధురశక్తి, పరోపకార సం
భావనమందు రక్తి, నిడుమా! సుజనావన! సాయిశంకరా!

చ॥ వినయవివేకశాలినిఁ బవిత్రచరిత్ర మనోజ్ఞలక్షణా
ద్యనుపమసద్గుణాస్తిను రసాంచితనిర్మలవృత్త, నిఁకఁ ద్వ
ద్ఘనకరుణాభిరక్షితను, గాఢ భవత్పదదాస్యకామ, నో
ర్త్రి నిగడ మత్కవిత్వసుతఁ బ్రీతిని బ్రోవవె సాయిశంకరా!

చ॥ విరిసినపుష్పవుఁ దేనియలు వేడుకఁ ద్రాగెడు తేఁటివోలె సుం
దరపరమార్థబోధనల తత్త్వము లెల్ల గ్రహించి, ధారణా
స్ఫురణకుఁ దెచ్చి, తన్నియమమున్ నెరవేర్చుచు, నీపదాబ్జస
ద్వరమకరందపానమధుపాయి నొనర్పుము సాయిశంకరా!

చ॥ రసనపవిత్రమై పరఁగు, రమ్యయశమ్ము ఘటిల్లు ఘోరదు
ర్వ్యసనము లెల్లఁదూలు, దురితావళు లెల్ల నశించు, నిందుసం
తసమును గల్గు, సంతతముఁ దావకపాదసరోజసన్నుతా
భ్యసనరసజ్ఞచిత్తునకు; భవ్యకృపాకర! సాయిశంకరా!

చ॥ పరిపరిరీతులన్ మనసు పర్విడు, దానిని నాఁపి నీదుప
త్సరసిజ మంటి యర్చనముసల్పి నమస్కృతు లాచరించి దా
స్యరతులఁ దెల్చి సఖ్యమును స్వాత్మని వేదనముఖ్య సేవలన్
బరఁగెడుభంగిఁ జేయు మని ప్రార్థనచేసెద సాయిశంకరా!

ఉ॥ ఆత్రముతోడ నీకుహృదయాబ్జము భక్తి నొసంగువారితా
పత్రయ మంతలో డులిచి వారల వాంఛల నెల్లఁ దీర్చి ప
ర్వత్ర శుభంబు లిత్తు వని పల్కఁగ వింటి; మనఃప్రసూనమే
పాత్ర మటంచు నీ కిడుదు భక్తిని, రక్తిని; సాయిశంకరా!

ఉ॥ సన్నుతిలేతతీవియకు జన్మము నంది భవత్పదద్వయిన్
సున్నిత మైనతత్తనువు శోభ దలిర్ప రహించునట్టి మేల్
పున్నెము పూలకే కలదు, పూజనొనర్పఁగఁ బూలపుట్టువేన్
మన్నన నా కొసంగఁ బలుమాఱులు వేఁడెద; సాయిశంకరా!

చ॥ అనుపమభక్తియుక్తిని మహాశివరాత్రిదినాన నీదుద
ర్శన మొనరించి పూజనము సల్పి భవద్ధృదయస్థలింగ మొ
య్యన వెలి కీవు తీయఁ గనునట్టిడు పాపము లెల్లఁ బాసి స
న్మునిజనవాసమై పరఁగుమోక్షముఁ బొందఁడె సాయిశంకరా!

ఉ॥ కోరనికోర్కెఁగాఁ గనులకున్ బెనుపండు వొనర్చు నీశుభా
కారముఁ గాంచి, వీనులకుఁ గమ్మనివిం దొనరించు నీనుడుల్!
వారక యాలకించి నిను భక్తి భజింపఁగ నోచి రెవ్వరో
వారె పునీతులన్, ఘనులు, భక్తులు, యోగులు; సాయిశంకరా!

ఉ॥ అంధుల కెల్ల దృష్టి వికలాంగుల కంగము, మూఁగవారికిన్
బంధురవాగ్విభూతి నిడి, పాపులపాపము, రోగిరోగని
ర్బంధము లెల్ల డుల్చి శ్రితవర్గము కొంగుపసిండి ముద్దగా
సంధిలు నీకు మ్రొక్కెదను సాధువశంకర! సాయిశంకరా!

ఉ॥ పాలును నీరువోలె నెడఁబాయని నెయ్యముతో భవత్పదా
బ్జాల నిరంతరార్చనము సల్పెడు స్వాంత మొసంగి, యెట్టిపా
పాలస మైనకార్యములయందుఁ జొరంబడకుండ సర్వదా
పాలన సేయు మంచు నినుఁ బ్రార్థన సేయుదు సాయిశంకరా

చ॥ తలఁచినయంతమాత్రన నెదన్ గనుఁబండు వొనర్చునీదుని
శ్చలనవమోహనాకృతిని స్వాంతము లో నిలుపంగలేక వెం
గలి నయి పుణ్యతీర్థములఁ గాకివలెన్ దిరుగాడునాదు చం
చల మగుబుద్ధి దిద్ది నను సాఁకుము తేఁకువ; సాయిశంకరా!

చ॥ చదువులయందుసక్తి, బుధజాలమునక్ బటుభక్తియుక్తి సం
పదలయెడన్ విరక్తి, ఋజుమార్గము లందనురక్తి, పూజ్యస
మ్మద మగుసూక్తి, దీనజనమండలిసేవ లొనర్చుశక్తి నా
కొదవ ననుగ్రహింపు సుగుణోదధి! ధీనిధి! సాయిశంకరా

చ॥ తెలియవు మంత్రతంత్రములు, తీపి తొనంకెడుస్తోత్రపాఠముల్
తెలియవు, ధ్యానమార్గములు సుదివ్యభవత్కథలన్ను దర్శనన్
దెలియవు, నీదురూపము మదిన్ దృఢభక్తిని నిల్పురీతులన్
దెలియవు, స్వామి! నన్నెటులు తేకువసాకెదో? సాయిశంకరా

చ॥ అనిలినకాంక్షఁ దావకపదాబ్జసుగంధమరందపానమో
దముఁగనునట్టిచిత్తమిఁకఁ దాఁదలపోయునె తుచ్ఛసౌఖ్యముల్
విమలవియన్నదీ పృథులవీచులరోచులఁ దూఁగురాజహం
సము, చనునొక్కపల్వలముసన్నిధి కెన్నఁడు? సాయిశంకరా

ఉ॥ ఎప్పుడువ్యాధిబాధలె; మఱెప్పు దరిద్రవృటీతిబాధలే;
యెప్పుడుఁ కష్టసంతతులె; యెప్పుడశాంతిమహోగ్రఘుఁఘులే
యెప్పుడుఁ చిక్కులే, నిను నుతింపఁ దలంపఁగ నెప్పుడడ్డులే;
యెప్పుడుఁచిత్తశాంతిలభియించునొ? చెప్పుము సాయిశంకరా!

చ॥ ధనమును గోర, వాహనవితానము వేఁడను నిత్యసద్యశ
మ్మును గొన నెంచ, సర్వసురపూజనభాజన మైననీపద
మ్మనయము సంస్తుతింపఁ గలయట్టి ప్రశస్తకవిత్వభూరిభూ
త్యనుపమసద్గుణమ్ములు సదా దయ సేయుము సాయిశంకరా!

ఉ॥ పాపపుఁగాల మాయె, భగవంతునిగూర్చి రచించు పుస్తకా
లాపన సల్ప రెవ్వరు, విలాసములందు మునుంగువారె; యే
వైపునఁ జూడఁగన్పడదు భక్తి యొకింతయు; నాస్తికత్వము
ద్దీపితశక్తి నిండె జగతిన్ గడుఁజిత్రము సాయిశంకరా!

చ॥ మన మనునట్టి క్షేత్రమున మంచితలంపు లటన్న గెత్తమున్
దనరఁగ బోసి పిమ్మటను నాటితిఁ డావకపూతనామ చిం
తన మృదుబీజసంతతులఁ తథ్యము; నాకృషిపండ నీకృపా
ద్యనుపమవృష్టి నింపి నను నాదృతిఁ గావుము సాయిశంకరా!

ఉ॥ జ్ఞానినికాను. బండితుఁడగా నటుమీఁద నుదాత్త దాతనుం
గాను, సుభక్త శేఖరుఁడగాను. మహాత్ముఁడఁగాను, గాని నీ
దైనకృపన్ గవిత్వకళ నర్మిలి నేర్చిన యట్టిదాసుఁడన్
గాన మదీయసత్కృతిని గానుకవెట్టిద సాయిశంకరా!

చ॥ నినుఁ గొనియాడ, నీదుపదనీరజసేవ లొనర్ప, నీకథల్
విన, నిను మోక్షదాయకుని వేడుకతోఁ గను మంచు నేను నా
మనసును హెచ్చరించి పయి మద్రసనాకరకర్ణయుగ్మలో
చనముల కొన్కవెట్టుదు విశాలకృపాకర! సాయిశంకరా!

ఉ॥ మానవకోటి కిల్బిషసమాగత సంస్కృతి రోగసంహతిన్
మానుపఁజాలు నౌషధము మానితకర్మపయోధివీచికా
నూన నిమగ్నులన్ దరికి నూల్కొనఁ జేయుప్లవంబు నీపద
ధ్యానము; గాన, నా కిడుము దానిని నిత్యము సాయిశంకరా!

ఉ॥ పట్టిన దెల్లబంగ రగుఁ, బల్కినదెల్ల ఫలించు, బిట్టుపో
ర్వెట్టుమహాఘసంతతులు విచ్చును, వచ్చును బుణ్యరాశి, చే
పట్టును సర్వసౌఖ్యములు భవ్యభవత్పదపద్మయుగ్మమున్
దట్టపుభక్తి నమ్మెచు నెదన్ నినుఁ గొల్చిన సాయిశంకరా!

ఉ॥ కారణజన్మ! విస్తృతజగత్సృజనావననాశనక్రియా
ధార! దురంతకిల్బిషవిదార! సుపర్వమునీంద్రచిత్తకా
సారచరన్మరాళ! విలసన్నిగమాంతశిరోవిహార! వి
ద్యారత! పుట్టపర్తినిలయా! కరుణాలయ! సాయిశంకరా!

చ॥ పరమదయాపరుండ వని, భవ్యమునీశ్వరచిత్తపద్మమం
దిరుఁడ వటంచు, సముద్ఘ్ణకృపానిధి వంచు, నాశ్రితా
మరధరణీరుహంబ వని మామకమానససూనమిచ్చెదన్
దిరముగఁ; బాల ముంచెదవొ? నీటను ముంతువొ? సాయిశంకరా

చ॥ అడవుల దాఁటినన్ గిరిగుహాంతరసీమల దాగియున్న న
ల్గడలకుఁ బోయి నిల్చినను గష్టములున్ వెస రాక మాన వీ
పుడమిని దేహధారులకుఁ; బూర్తిగ నిన్నెద నమ్మువార లే
యడలును లేకయుండురు కృపామృతసాగర సాయిశంకరా!

చ॥ జలములులేని యూరు, కవిసంతతి కీయని పేరు క్షారపూ
జలనిధిలోని నీరు, వెల చక్కఁగలేని బజారు, భూరిమం
జులసరసోక్తిసంపదలు జొబ్బిలకుండెడి కైతతీరు నిన్
దలఁపనినోరు వ్యర్థముకదా? కరుణాకర! సాయిశంకరా!

ఉ॥ కందొవవిందుఁ గూర్చు నెసక మ్మగు నీదునివాససీమ, నా
నందముఁ గూర్చురూపము ఘనం బగుపాపములెల్లడించు, నిం
పొందు భవత్కృపారసముపొందఁ బునర్జని యుండదెందు బల్
విందు త్వదీయవాక్కు పృథివీజనపాళికి; సాయిశంకరా!

ఉ॥ ఆదిమవాక్కులం బరఁగునట్టి మహోన్నతవేదరాశికిన్
బాదు శ్రితాళిపాలిటికి బంధురకల్పక, మిద్ధభక్తిసం
పాదనకున్ శుభాశ్రమము, మాఅటరౌప్యనగమ్ము పర్తి యి
మ్మేదిని నీవె దేవుఁడవు మృగ్యము నీసరి సాయిశంకరా!

ఉ॥ చందురునందునన్ గళలు, సాగరమందు మనోజ్ఞరత్నముల్
చందనమందు సౌరభము చాలగఁ గల్గువిధాన దేవ! నీ
యందు మహోఘ్నసద్గుణము లద్భుతమై వెలుగొందుఁగాదె? నీ
చందము లేరి కబ్బెడిని? సద్గుణసాగర! సాయిశంకరా!

ఉ॥ ఆంధ్రుల భూరిభాగ్యమహిమాతిశయంబున నేఁడు నీవు ధీ
రుంధ్రతఁ బుట్టపర్తి నపురూపముగా నవతార మందినీ
రంధ్రదయాధునిన్ బఱపి రక్ష యొనర్చెడు నీదురాకచే
నాంధ్రధరిత్రి ధన్యతర మయ్యె; దయాకర! సాయిశంకరా!

చ॥ అనుపమవేదశాస్త్రనివహామ్ముల లక్ష్యము దప్పె. ధర్మసా
ధనలు నశించె, సత్యము యదాయద లయ్యెఁ దపోజపమ్ములున్
వినుకతిమాత్రమయ్యె నిఁక వేయి వచింపఁగ నేల? బాగుసే
యను బ్రతిబద్ధకంకణుఁడవై చరియింపుము సాయిశంకరా!

ఉ॥ చిక్కులు గల్గి వేదనలచే మన సెల్లఁ గలంతఁ జెందుచో
నెక్కడలేనిశక్తి యుదయించును, నిత్యము నిన్ నుతింపఁగా
నెక్కుడుబుద్ధి పుట్టుఁ బయి నెక్కుడుశ్రద్ధయుఁ గల్గు గానఁ బెన్
జిక్కులఁ బెట్టియైన నినుఁ జేరఁగఁ జేయుము సాయిశంకరా!

ఉ॥ ఆటలఁ గొన్నినాళ్ళు, పరిహాసపుమాటలఁ గొన్నినాళ్ళు స
య్యాటలఁ గొన్నినాళ్ళు, నఘముం బెడుబాటలఁ గొన్నినాళ్ళు పో
రాటలఁ గొనినాళ్ళిటులు రాయిడిఁ బొందితి నేఁటిదాఁక, నా
రాటముఁ బాపి శీఘ్రముగ రక్షణసేయుము సాయిశంకరా!

ఉ॥ మానక నీదుసేవ నియమంబుగఁ జేయఁగ నెంచినాఁడ, దు
రాత్మనులఁ జెంతఁజేరి బతిమాలుచు వారిముఖంబు ప్రీతికై
మాసుగ నిచ్చకాల్ పలుకమానస మెప్పుడు నంతయున్ ప్రభూ
యేనుఁగు నెక్కి దిడ్డిఁ జొఱ నేటికి నాకిఁక? సాయిశంకరా!

చ॥ తరువులయందుఁ గల్పకము, తారకలందు ధ్రువుండు, ధారుణీ
ధరములయందు మేరువు నుదాత్తపుగణ్యతఁ గాంచినట్టివై
ఖరి గను నీవు దైవతనికాయములందుఁ బ్రశస్తిఁ గాంచవే?
వరవదనా! కృపాసదన! పాపవిమోచన! సాయిశంకరా!

ఉ॥ ఎక్కడఁ జూచినన్ గపటమే యభివృద్ధిని జెందుచుండెఁ బై
నెక్కుడుగా నధర్మమె మహీస్థలిఁ దాండవ మాడఁ జొచ్చెఁ బెం
పెక్కఁగ యోగ్యుఁ డొక్కఁ డెటనేనియు నుండిన వాఁడశాంతిచే
స్రుక్కును గాని వేఱయినత్రోవ నెఱుంగడు సాయిశంకరా!

చ॥ బ్రదికిన నాల్గునాళ్ళు జవరాండ్రకొ, కల్మికొ లేక పెద్దవా
పదవులకున్ బ్రయత్నములు బ్రన్ననచేతురు; శాంతిలేక నీ
యది శుభ మిద్ది చెడ్డదనునట్టివిచక్షణ వీడి నీతినిన్
వదలినవారి దుర్దశలఁ బాపవె బ్రోపవె సాయిశంకరా!

ఉ॥ చుట్టునుచుట్టి యిట్టె తలసూపెడు నాస్తికతాపిశాచసం
ఘట్టనకున్ దలంకి మది కంపిలుచుండినధర్మదేవతన్
గట్టిగఁ బ్రోవ నిత్యము, సనాతనధర్మ మటన్న ధర్మమున్
నెట్టన నుచ్చరించుచు మునిప్రకరావన! సాయిశంకరా!

చ॥ ధరణిని నీదునామజపతత్పరతన్ భవవార్ధివీచికో
త్తరణము సల్పి నిత్యసుఖదాయక మైనయఖండమోక్షరా
జ్యరమకుఁజేరి ధన్యులయి శాశ్వతసౌఖ్యము నందరే బుధుల్?
వరసదయానిధీ సుగుణసంఘపయోనిధి! సాయిశంకరా!

ఉ॥ మానవజాతికభ్యుదయమార్గముఁ జూపెడి నీపవిత్రప
ద్ధ్యానము, గౌరవాప్తి కిసుమంతయుఁ భంగముఁ గల్గనట్టి స
న్మానము, నిత్యసత్యభవతారకతావకసత్కృదాసుధా
పాన మొసంగి నన్నుఁ బరిపాలనసేయుము సాయిశంకరా!

చ॥ మనుజులకన్నఁ గాకములె మంచిగుణమ్ములఁ నొప్పు; నెట్లవన్
దినుటకు నేదియైన ధరణిన్ లభియించినఁ దక్కుకాకులన్
గునగున గావుకావు మని కూరిమిఁబిల్చు; మనుష్యుఁ డన్నచో
ననుజులనేనిఁ బిల్వఁ డెద స్వార్థము నూనుచు సాయిశంకరా!

చ॥ మమతఁ ద్యజించి భూమిధనమందిరదారసుతాదికంబు ని
త్యమని మలప్రపూర్ణవపువం దభిమానము నుజ్జగించి, సౌ
ఖ్యము క్షణభంగురం బనుచు నాత్మఁ దలంచి సభక్తి నీపదా
బ్జముల నుతించుచేఁ జనికి సార్థక మౌఁగద? సాయిశంకరా!

ఉ॥ అక్షరరూప మొంది సకలార్థిజనావళి నుద్ధరింపఁ బ్ర
త్యక్షతఁ బుట్టపర్తిపురియందు జనించినశర్వ! నాదుపా
పక్షయ మాచరించుము, భవత్పదదాసునిగాఁగ నన్నిఁకన్
దక్షతసల్పి చేకొనుము; త్యాగవిభూషణ! సాయిశంకరా!

ఉ॥ పూవులు విచ్చి తావులు గుబుల్కొనురీతిని, మంచిముత్తెపున్
గోవలు రాల్చినట్లు జతగూడి సమీరములన్, బరాగముల్
రేపినభంగి, మోద మెద రేఁగును దావకపూతనామగా
నావళి నాలకించుతరి నాకు జగత్ప్రభు! సాయిశంకరా!

చ॥ మధురము తావకాకృతి యమంగళసంజ్ఞవనమ్ము మాధురీ
మధురము తావకీనబహుమానమృదూక్తులు, వానికన్ననున్
మధురము సద్దయారసమంచితదృక్కులు, వానికన్ననున్
మధురము నీదునామభజనమ్ము జగమ్మున సాయిశంకరా!

ఉ॥ నీకథ లాలకించుటకు నీపదపద్మయుగంబుఁ బట్టి సే
వాకలనం బొనర్పఁ గనుపండు వొసఁగెడు నీదురూప మా
లోకనచేయఁగా దలఁపులోప మొకింతయు లేదుగాని నా
కాకమనీయభాగ్యరమ గల్గు టిఁకెన్నఁడొ? సాయిశంకరా!

ఉ॥ ఎవ్వనిపిచ్చి వాని కగు నెంతయు మోద; మతండిఁ కన్యులన్
నవ్వను మూఢుఁ డంచు నెదనమ్ము దృఢమ్ముగ స్వీయమార్గమే
క్రొవ్విరిబాట యంచు మది గొబ్బున; నాకవితాసుమావళిన్
మవ్వపు నీపదద్వయి సమర్పణచేసెద సాయిశంకరా!

చ॥ చెలువగ దేహమే రథము, జీవుడు సారథి, యింద్రియమ్ములే
కలితతురంగముల్ దిషణ కళ్ళెముగా జనిఁ గంటి; నిత్యమౌ
తెలివి నొసంగి సారథిని తిన్ననిత్రోవ గమించి గమ్యమౌ
స్థలమును జేర దిద్దు మని సన్నుతిచేసెద సాయిశంకరా!

ఉ॥ మానుషరూపధారి! యసమానకృపామృతధారి వైదిక
జ్ఞాననిధిప్రచారి! భవకర్మవిమోచనకారి! యాశ్రితా
జ్ఞానవిదారి! భక్తజనకల్మషహారి! యఘారి! నిత్యస
న్మానితధర్మచారి! శ్రితనందితవాగ్ఝరి! సాయిశంకరా!

చ॥ తరణికులాబ్ధిసోమ! భవతారకనామ! జనాళిపాతకో
త్కరనిబిడాంధకారభరదామ! కృపామృతసీమ! చంద్రభా
స్కరనయనాభిరామ! శ్రితసంఘసమంచితకామ! సన్నుతా
మరకులసార్వభౌమ! బుధమాన్యసురద్రుమ! సాయిశంకరా!

ఉ॥ కిన్నరసిద్ధసాధ్యఖగకేచర భూచరు లాశ్వనేయులున్
పన్నగయక్షరాక్షససుపర్వ మునీశ్వరముఖ్యజాతముల్
సన్నుతి సల్పలే రన నశక్తుఁడ మర్త్యుఁడ నైననేను నీ
యున్నతి సన్నుతించుటకు నోపగలాఁడనె? సాయిశంకరా!

ఉ॥ శ్రీకమనీయమూర్తి మును షిర్డిపురమ్మున సాయిబాబవై
ప్రాకటరీతిఁ బుట్టి శ్రితవర్గముఁ బ్రోచితి వీవు; నేఁడు భ
వ్యాకృతిఁ బుట్టపర్తిపురియందు జనించితి వయ్య! దివ్యలీ
లాకలికావతార! కుటిలద్విషదంతక! సాయిశంకరా!

ఉ॥ చిత్రవిచిత్రవస్తువులఁ జేత సృజించుచు భక్తసంఘకృత్
స్తోత్రముగా బహూకృతులతోడ నొసంగుచు, దీర్ఘరోగులై
యాత్రముఁ జెందుమానవులవ్యాధి విభూతి నొసంగి మాపి స
ర్వత్ర శుభంబుఁ గూర్చెదవు భక్తుల కిద్ధర సాయిశంకరా!

చ॥ వంచనసేయు తృష్ణలకు వశ్యముచెందుచు మంచిచెడ్డ లొ
క్కించుక లెక్కసేయకయె కేవ లమార్జనసేయ లోనభా
వించు చధర్మమార్గులు వేడుకఁ ద్రొక్కెడువారి వీఁకమై
మంచిపథాలకున్ మలపుమా కరుణాకర! సాయిశంకరా!

ఉ॥ మూఁగకు మాటలబ్బెను విభూ! ఘనవైద్యులకేని నంతయున్
లోఁగనిమొండిరోగములు లోచనవీక్షణమాత్ర బోయె; దృ
ష్ట్యాగమనంబు నంధజను లందరి నీదువిభూతిచేత నీ
వాగమృతానఁ దాపములఁ బాసిరి భక్తులు; సాయిశంకరా!

ఉ॥ దానపరాయణుం డయిన దాత దరిద్రుఁడునైనఁ గూడ మో
డాన నెదైనఁ దెచ్చి యిడుఁ దప్పక యర్థికిఁ జందమామ తే
జోనిధి కాకపోయినను సూర్యుని దగ్గరకాంతిఁ దెచ్చి యెం
తేని ధరాతలంబుపయి నింపఁడె నిండుగ సాయిశంకరా!

చ॥ తలఁపఁ బరోపకారములఁ దన్పెడుతజ్ఞుఁడు కష్టకార్యసం
చలనమునన్ సహించుచు నొసంగును దీనులవాంఛలన్ రసా
తలమునఁ గల్గునీరములఁ దద్దయు నేతము తెచ్చి యెండచే
నలఁగినచేల కీయదె? సనాతనసత్పథి! సాయిశంకరా!

క॥ సకలము నీమహిత్త్వమని స్వాంతమునందున నమ్మినాఁడఁ ద
ప్పక నను నీట ముంచెదవొ, పాలనె ముంతువొ దేవదేవ! యీ
ప్రకటచరాచరప్రకృతిపాలనదక్షుఁడ వీవెగావె? నే
వకుఁడను, రక్షణీయుఁడను; పాలన సేయవె సాయిశంకరా!

శా॥ వేఁడివెలుంగుఱేఁడు ప్రభవించునుగాక ప్రతీచియందు, నూఁ
గాడెడుఁగాక మేరువు నగాగ్రమునన్ గమలంబు పుల్లమై
పోఁడిమిఁ జూపుఁగాక; హుతభుక్కును శైత్యము గాంచుగాక తా
మాడినమాట సజ్జను లొకప్పుడుఁ దప్పరు సాయిశంకరా!

ఉ॥ దండము పుట్టపర్తికిని, దండము లందలివృక్షజాతికిన్,
దండము నీపదమ్ములకు, దండము నీ దగుపాదధూళికిన్,
దండము నీదుమూర్తికిని, దండము చిత్రవతీమతల్లికిన్,
దండము భక్తసంతతికి; ధర్మనిధానమ! సాయిశంకరా!

ఉ॥ వేదనినాద మొక్కెడెన వీనులవిందు నొనర్ప, భక్తస
మ్మోదమనోజ్ఞగీతరవముల్ మినుముట్టఁగఁ గీరశారికా
స్వాదునినాదముల్ నిగుడ భక్తసమూహముతోడఁ గూడు నీ
పాదము లాశ్రయింపఁగల భాగ్య మొసంగుము సాయిశంకరా!

చ॥ చిఱునగ వాననంబునను జిందులుఁ ద్రొక్కఁ గటాక్షమేదురో
దరరుచిమాలికల్ నయనతామరసంబులఁ దొంగిలింప సుం
దరవరదాభయప్రముదితం బగుముద్రలు కేల నొప్ప నీ
సురుచిరమూర్తి నే నెపుడు చూచెదనో గద? సాయిశంకరా!

చ॥ అనుపమలోకపావనశుభాకృతి నీకృతు లాచరించుచున్,
వినుచుచుఁబాడుచున్ హృదయపీఠిని నీదగుమూర్తి నిల్పుచున్
నిను భజియించుచున్ సతము నీపదపద్మశుభార్చనవ్రతా
ద్యనుపమభూరిభాగ్యముల నందు టెఁకెన్నఁడొ? సాయిశంకరా

ఉ॥ అల్పుఁడఁ, జిత్త మన్నపొలమందున్ ప్రాకృతకర్మకామసం
కల్పము లెల్ల బీజములుగా మొలకెత్త దొడంగె; నీమనం
కల్పముచేత వానిఁ ద్వరగాఁ దరలించి మహాద్భుతప్రభా
నల్పకటాక్షవీక్షణము నాపయి నింపుము సాయిశంకరా!

ఉ॥ నానెము లైనశబ్దముల నాకృతి కిమ్మని యందునా? బుధ
శ్రేణులు మెచ్చుభావములఁ జేర్చు మటంచు వచింతునా? భవ
త్పాణినిఁ బెట్టు నీకృతిని భక్తవతంసులు మెచ్చ నిత్యక
ల్యాణము వచ్చుతోరణము నౌనటు సల్పుము సాయిశంకరా!

ఉ॥ చల్లనిచూపుతోఁ, దలిపిజాబిలిఁ గేరెడుమోముతో, సదో
త్ఫుల్లవికాసమోదమురితో, వరదాభయహస్తముద్రతో
మొల్లలురాలు మేల్పలుకులమోసులతోఁ గరుణారసంబుఁ జి
ప్పిల్లెడుప్రేమతోఁ గనులవిం దొనరింపుము సాయిశంకరా!

ఉ॥ అక్షరమూర్తి వంచు నఖిలాత్మకుఁ డంచుఁ బ్రపూర్ణసత్త్వహా
దక్షుఁడ వంచు సిస్మితవదాస్యుఁడ వంచును నాలకించి ప్ర
త్యక్షముగాఁగ నన్నుఁ గనుపట్టి యదృష్ట మొసంగ భక్తసం
రక్షక! వేఁడుచుంటిని శిరమ్మును వంచుచు సాయిశంకరా!

ఉ॥ పాత్రతఁబట్టి యిచ్చునెడ భవ్యఫలాప్తి రయంబ యబ్బు న
ర్వత్ర నపాత్ర మైన నది వమ్మగు విత్తులు సారవంతమౌ
క్షేత్రమునందుఁ జల్ల నొకటేడెడు పుట్టెడు పండు, నూషర
క్షేత్రములోనఁ జల్లిన నశించును నిక్కము సాయిశంకరా!

చ॥ అలఁతిగ నిచ్చినన్ బరమహర్షము నొందును పేదవాఁడు న
గ్గలముగ నిచ్చినన్ దనివిఁ గాంచఁడుగా కలవాఁ డదెట్లనన్
జలదము కొద్దినీయనిడ సస్యము లగ్గలమౌను, వాహినీ
జలములు చేరినన్ జలధి సంతస మందునె? సాయిశంకరా!

చ॥ రిపుగణమువేవి కాముఁడు నుదగ్రత క్రోధుఁడు లోభమోహమ
త్సరమదనామ లార్వురు వెనన్ దమకంబున నన్నుఁ బట్టఁగా
నురవడి వెంబడిన్ బరువు లూనఁ దొలంగిరి వారివారికిన్
నరగునఁ జిక్కకుండ నను సాఁకుము ప్రేమను సాయిశంకరా!

చ॥ కరములఁగాని, కాయమునఁగాని, మనఃశ్రవణాళిఁగాని, మ
చ్చరణయుగానఁగాని, కనుదమ్ములచేతనుగాని, చూచియో
యెఱుఁగఁ జూడకో సలిపి నట్టియఘంబు క్షమింపుమంచు నీ
పరమపదంబుఁ బట్టితిని; భక్తజనావన! సాయిశంకరా!

ఉ॥ మానవుఁ డాత్మమృత్యు వను మాటఁ దలంచిన భీతచిత్తుఁడై
పూనిక దానహోమజపముల్ బొనరించు నివారణార్థమై
కాని యనిత్యమంచు నెఱుగం డవి: భక్తి భవత్పదద్వయీ
ధ్యానమొనర్చ మృత్యుజయ మౌటఁదలంపఁడు సాయిశంకరా!

ఉ॥ సంతతభోగభాగ్యసుఖసంఘము గల్గుతఱిన్ స్వశక్తి సి
ద్ధాంతములన్ వచించి తనదౌ ఘనతన్ బ్రకటించు; నంతలోఁ
జింతలు గల్గ నత్తఱిని జేసినతప్పులు కప్ప వెట్టి వే
దాంతములన్ వచించు నరుఁడంతట నింతట సాయిశంకరా!

చ॥ కలిపిరి భక్తినీతిశతకమ్ములు పూర్వము పాఠశాలలన్
జిఱుతల కెల్ల, దాన గుణశేముషితో వికసించినారు, నేఁ
డఱిమఱి మానసీతినియమంబులు వీడిరి; మొక్క వంపఁగాఁ
నిరవగుఁగాని మ్రా నయిననెట్లువంగును? సాయిశంకరా!

ఉ॥ ఈషణముల్ త్యజించి, సకలేశ్వరునిన్ గని సర్వజీవసం
తోషమె నీకుఁ జాలఁ బరితోష మటంచుఁ దలంచుభక్తుఁడే
ద్వేషము, క్రోధ మాది యగువృత్తులఁ దా దరిఁ జేరనీఁడు పీ
యూషముఁ గ్రోలునాతఁడు పయోరుచు లెన్నునె? సాయిశంకరా

ఉ॥ పాయునుగిల్బిషంబులు, సహాయమువాయును, దుర్మిత్రముల్
పాయు, విచారసంతతులు పాయును బాయును దీర్ఘరోగముల్
డాయునుభోగభాగ్యములు దండిగ డాయు మనోరథార్థముల్
పాయనిభక్తి నీపదముఁ బట్టినవారికి సాయిశంకరా!

*ఉ॥ నీదయలేనివారలకు నీముఖదర్శనభాగ్య మబ్బఁగాఁ
బోదని భక్తపెద్దలన మున్వినియుంటిని. నేఁటిదాఁక నీ
పాదసరోజదర్శనము ప్రాప్తముకాదు. ప్రయత్నలోపమా?
లేమ: దయామయా! కరుణ లీలగఁ దెల్పుము సాయిశంకరా!

---

* ఈ పద్యము వ్రాసిన తరువాత 1970 సెప్టెంబరులో శ్రీవారి దర్శనమైనది.

ఉ॥ ఆపదఁబాపు మంచడుగ, నయ్యది యియ్యతి యిమ్మటంచునిన్
రాపిడి చేయఁబోను దయ రంజిల నీకరుణాకటాక్షదీ
క్షాపరిపూర్ణవీక్షణవికాసము నింపి త్వదీయదర్శన
ప్రాపితుగా నొనర్చు మని పాణి మొగిడ్చితి సాయిశంకరా!

ఉ॥ భానుసహస్రదీధితులు పర్వుట మానిన మానుఁగాక, యం
భోనిధిసప్తకం బినికిపోయినఁ బోవునుగాక, గోత్రసం
తానము తూలుఁగాక; ప్రమదంబునఁ దావకపాదపద్మసే
వానిరతాత్మ నాపదలు, బాధలుఁ జేరవు సాయిశంకరా!

చ॥ పరమదయాంతరంగ! పరిపాలితసైజజనానుషంగ! వి
స్తరకలుషాంధకార సముదగ్రపతంగ! శుభాంగ! భక్తితో
శరణ మటంచు నీదుపదసారసయుగ్మముఁ బట్టు నాపయిన్
గరుణ వహింపకుండుటది న్యాయమె? తెల్పుము:సాయిశంకరా

చ॥ తిర మగుభక్తితో నిను హృదిన్ బదిలమ్ముగఁ బాదుకొల్పినీ
స్మరణ మొనర్పఁగాఁ గలుగు సంతతభాగ్యము లబ్బువెట్లుదు
ర్భరపరదాస్యబంధనపరంపరలందునఁ జిక్కి స్రుక్కి ని
ర్భరత శ్లథాంగుఁ డైన ననువంటి మనస్వికి? సాయిశంకరా!

చ॥ ఇఁకను విలంబ మేమిటి? కహీనకృపామృతధార లొల్కుతా
వకకరుణాకటాక్షము లవశ్యము నాపయి నింపి నీదుసే
వకుఁడుగ జేయుమాపయని వైశము త్వత్పదసన్నిధానమున్
బ్రకటగతిన్ భజింపఁ గలభాగ్యము కల్గును సాయిశంకరా!

చ॥ జలములు మింటినుండిపడి
చయ్యన సాగి మహాపయోధిలోఁ
గలయు తెఱంగునన్ జనని
కాయము నెవ్వరికై నమస్కృతుల్
సలుపుదురో య వన్నియును
జక్కఁగ ని న్నొగిఁ బొందుచుండు;నో
జలరుహపత్రలోచన!వి
శాలకృపాకర! సాయిశంకరా!

చ॥ సురభిళమై మఱెన్నఁటికిఁ
జొక్కనిదై, రసయుక్తమై, మనో
హార మయి, భక్తపాళికిని
హార్ద దమౌ "శతపత్రహారమున్"
స్థిర మగుపద్యపుష్పముల
చే విరచించితి నీయురంబునన్
బెరిఁగినభక్తి నుంచితిని
"బేరనశాస్త్రిని" సాయిశంకరా!

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ



